Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 25 • 21-6-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



## ● దిగ్విజయ్ సింగ్ నియామకం పట్ల కాంగ్రెస్ కంటే...

# వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీలో ఆనందం!



రాష్ట్ర కాంగ్రెస్‌కు అధిష్టానం పరిశీలకుడిగా దిగ్విజయ్ సింగ్ నియామకం కాంగ్రెస్ కంటే వైఎస్‌జగన్ పార్టీలో ఆసక్తి రేకెత్తిస్తున్నది. విచిత్రంగా కన్పిస్తున్నా, ఇది నిజం.

దిగ్విజయ్ సింగ్ నియామకంలో అధిష్టానానికి ప్రత్యేక వ్యూహం, ఉద్దేశ్యం వంటివేవీ లేవని, ఏ మొగుడూ లేనప్పుడు అక్క మొగుడే దిక్కన్న సామెతగా ఆయన్ను దించారని కాంగ్రెస్‌వాదుల అభిప్రాయం. రాష్ట్రానికి ఇదివరకు వాయిలార్ రవి పరిశీలకుడిగా వుండేవాడు. అయితే ఆయన మాట తీరు ఎవరికీ నచ్చలేదు. చాలా అహంకార పూరితంగా మాట్లాడుతున్నాడని, ఆయన వద్దకు వెళ్లడానికే మనసు రావడం లేదని రాష్ట్ర కాంగ్రెస్‌వాదులు మొత్తుకోవడంతో గులాం నబీ అజాద్‌ను రంగంలోకి దించింది అధిష్టానం. గులాంకు మన రాష్ట్రానికి చాలా దగ్గర సంబంధాలున్నాయి. పైగా ఆయనది అచ్చొచ్చిన చెయ్యి అన్న నానుడి వుంది. గులాం పరిశీలకుడిగా వున్న ప్రతి రాష్ట్రంలో కాంగ్రెస్ గెలవడం ఒక ఆనవాయితీగా నడిచింది. దానితో గులాం రాక శుభ సంకేతమని అందరూ సంతోషించారు. అయితే ఎన్నికల వరకు ఆంధ్ర వ్యవహారాలు తన చేతుల్లో పెట్టుకొంటే పరువు పోవడం తప్ప జరిగే మేలేమీ లేదని గులాం బాగా గ్రహించాడు. దానితో చాలా తెలివిగా నడుము నొప్పి కారణంగా చూపి పక్కకు తప్పుకొన్నాడు. ఏఐసిసి ప్రధాన కార్యదర్శులలో సీనియర్లను మాత్రమే ఆంధ్ర వంటి రాష్ట్రాలకు పంపుతారు. అటువంటి సీనియర్ మరొకరు లేకపోవడంతో డిగ్గీ రాజా వారికి పగ్గాలు అప్పచెప్పింది సోనియాగాంధీ.

దిగ్విజయ్‌సింగ్ చాలా సాత్వికుడు. మెత్తగా మాట్లాడుతాడు. ఎవరినీ నొప్పించడు. గతంలో ఆంధ్రలో పని చేసిన అనుభవం వుంది. చాలా మంది నేతలతో ప్రత్యక్ష పరిచయాలున్నాయి. అయితే రాష్ట్రంలో పరిస్థితులే బాగా లేవు. తెలంగాణ పేరుతో ఆ ప్రాంతం నేతలు పూర్తిగా క్రమశిక్షణ తప్పి ప్రవర్తిస్తున్నారు. అధిష్టానం అన్న భయం వారిలో అణుమాత్రం లేదు. గట్టిగా మాట్లాడితే పార్టీ వదలి పెట్టి వెళ్లి పోతున్నారు. తెలంగాణ ఇవ్వకుంటే రేపటి ఎన్నికలలో మీరు టిక్కెట్ ఇచ్చినా పోటీ చేయమని బెదరించాడు సీనియర్ మంత్రి జానారెడ్డి. దాదాపు అరడజను మంది మంత్రులు, పాతిక మంది ఎమ్మెల్యేలు ఆయనతో వంతపాడారు. ఆంధ్ర, రాయలసీమలలో కూడా పరిస్థితి ఇట్లనే వుంది. అక్కడ తెలంగాణ అయితే ఇక్కడ జగన్. రాష్ట్ర చరిత్రలో ఇంతటి సంక్షోభ పరిస్థితి కాంగ్రెస్‌కు ఎప్పుడూ ఎదురు కాలేదు. అటువంటి దురదృష్టకర పరిస్థితులలో రాష్ట్ర పరిశీలకుడిగా రావడం దిగ్విజయ్ సింగ్‌కు ఎంతమాత్రం సంతోషం కల్గించక పోవచ్చు. కానీ సోనియాగాంధీ చెప్పింది కాబట్టి, ముళ్ల కిరీటం అని తెలిసినా తల మీద పెట్టుకొన్నాడు. దిగ్విజయ్ సింగ్ వచ్చినందువల్ల కొత్తగా పార్టీకి ఒరిగేది ఏదీ వుండదన్న నిజం తెలుసు కాబట్టి కాంగ్రెస్‌వాదులలో ఈ నియామకం పట్ల ఏ మాత్రం స్పందన లేదు.

అయితే విచిత్రంగా వైఎస్ జగన్ పార్టీ మాత్రం ఆయన రాకను స్వాగతిస్తున్నది. వైఎస్ రాజశేఖర్ రెడ్డికి దిగ్విజయ్ సింగ్‌కు చాలా సాన్నిహిత్యం వుండేది. ఆ సంబంధం వల్ల ఆయనకు జగన్ మీద

కొరవ 14వ పేజీలో

## జమీన్‌రైతు

### ప్రకటనల ధరలో మార్పు

న్యూస్‌ప్రింట్, యితర ప్రింటింగ్ ఖర్చులు ఎంతగానో పెరిగిన దృష్ట్యా, జమీన్‌రైతు ప్రకటనల ధరలను పెంచక తప్పడం లేదు. జూలై 5తేది నుంచి జమీన్‌రైతు ప్రకటనల ధరలు ఈ క్రింది విధంగా వుంటాయి.

చదరపు సెంటీ మీటరు : రు 40.00లు

| | | కలర్ | బ్లాక్ అండ్ వైట్ |
|---|---|---|---|
| మొదటి పేజీ | : | 100% అదనం | 75% అదనం |
| వెనుక పేజీ | : | 75% అదనం | 50% అదనం |
| లోపలి పేజీలు | : | 50% అదనం | - |

పాఠకులు, ప్రకటనకర్తలు ఈ మార్పులను గుర్తించి, యధా ప్రకారం తమ ఆదరణ కొనసాగిస్తారని ఆశిస్తున్నాము.

–మేనేజర్

# కైలాసం కోపగించింది

హిందువులకు పరమ పవిత్ర ప్రదేశాలలో ఒకటైన కేదార్‌నాథ్ కొండలు కుప్ప కూలిపోయాయి. మందాకినీ నది వరద ముప్పుకు బండలుగా మారిపోయాయి. హిమాలయాలలో 11870 అడుగుల ఎత్తున నెలకొని వున్న మహాదేవుడి నివాసమే కేదార్‌నాథ్. 13 వందలేళ్ల క్రితం ఆది శంకరాచార్యుల వారు ఈ దేవాలయాన్ని ప్రతిష్ఠించారని ప్రతీతి. అప్పటి నుంచి అది హిందువులకు అపర కైలాసంగా భాసిల్లుతున్నది. ఈ రోజుకు కూడా కేదార్‌నాథ్ వెళ్లడానికి సరైన రోడ్డు వసతి లేదు. సరిహద్దు భద్రతా బలగాలు ఏర్పాటుచేసిన అతుకు బొతుకుల రహదారి మాత్రమే దిక్కు. మహోన్నతమైన గిరి శిఖరాల అంచున కొద్ది భాగాన్ని చదును చేసి ఏర్పాటుచేసిన రోడ్డు అది. అటు చూస్తే పై అంచు కనపడని కొండ; ఇటు చూస్తే కళ్లు తిరిగే రీతిలో అగాధాల వంటి లోయలు. ఆ రహదారిలో ప్రయాణమే ఒక సాహసం. కానీ ఏటా కొన్ని లక్షల మంది హిందూ భక్తులు ఆ మందిర సందర్శనకు ఆ సాహసం చేస్తుంటారు. కొన్ని వందల సంవత్సరాలుగా ఆ ఆనవాయితీ కొనసాగుతున్నది.

ఈ కొండలు ఇప్పుడు బండల కుప్పలుగా మారాయి. కేదార్‌నాథ్ మందిరం పక్కనే ప్రవహించే మందాకినీ నది ఉగ్రరూపం ప్రదర్శించడంతో వూహించని భీభత్సం జరిగిపోయింది. మందిరానికి ఆరు కిలోమీటర్ల దూరంలోని చార్‌బారి అనే మంచు సరస్సు పొంగి ప్రవహించింది. దాని ధాటికి కేదార్‌నాథ్ శిఖరంపైభాగాన వుండే మంచు బండలు కదిలిపోయాయి. ఆ భీకర ఒత్తిడికి కొండ కాస్తా పగిలిపోయి, బండలుగా క్రిందకు జారి, మందిరానికి సమీపంలో నిలిచిపోయాయి. మందాకినీ నది వరద, చార్‌బారి సరస్సు నీరు కలగలిసి ఆ బండల పక్కనుంచి భయానక వేగంతో జరజర ప్రవహించాయి. మందిరం మాత్రం భద్రం. కానీ దాని ప్రాంగణంలోని ఇల్లు, వాకిళ్లు సమస్తం బురదలో సమాధి అయిపోయాయి.

ఇక అక్కడ నుంచి అంతా ఉత్పాతమే. పై నుంచి ఉగ్రరూపంతో క్రిందకు దూకిన మందాకినీ నదికి, అలక నందా నది తోడు కలిసింది. 48 గంటలపాటు ఎడతెరిపి లేకుండా కురిసిన కుండపోత వర్షానికి కేదార్‌నాథ్ రోడ్డు సమస్తం కొట్టుకపోయింది. దాని అంచున నిర్మించిన వందలాది ఇళ్లు పేక మేడల వలె కుప్పకూలి ప్రవాహంతో కొట్టుకపోయాయి. రోడ్డు మీద వున్న కార్లు, లారీలు, బస్సులు కాగితం పడవల మాదిరి నీళ్లలో కలిసిపోయాయి. కేదార్‌నాథ్ పర్వత శ్రేణులు నవంబర్ నుంచి ఏప్రెల్ వరకు మంచు ముద్దలుగా వుంటాయి. మే నుంచి అక్టోబర్ వరకు మాత్రమే ప్రయాణానికి వీలు. అందువల్ల ప్రపంచమంతటి నుంచి వేల సంఖ్యలో భక్తులు ఆ రోడ్డు మీద ప్రయాణిస్తున్నారు. వారందరిదీ వర్ణించలేని దుర్గతి. తమ కళ్ల ముందే తాము నిలుచున్న నేల జారిపోవడం ఎంతటి భీభత్స అనుభవమో వర్ణించలేము. అంతెత్తు కొండల మీద నుంచి కొన్ని వందల టన్నుల బరువుండే బండరాళ్లు తుపాకీ తూటాల వలె దూసుక వచ్చి క్రింద పడుతుంటే చూడడం ఎంత భయంకరమైన చేదు అనుభవమో మాటలలో చెప్పలేము. ఎన్ని వందల మంది లేదా ఎన్ని వేల మంది వాటి క్రింద భూస్థాపితమై పోయారో, ఇంకెందరు బురదలో కూరుకపోయారో, ఇంకెందరు నీటి ప్రవాహంలో కలిసిపోయారో తెలియడం లేదు. హిమాలయాలలో మనకు తెలిసి ఇంత దారుణమైన ఉత్పాతం ఎప్పుడూ జరగలేదు.

లక్షల సంవత్సరాలుగా సమున్నతంగా, స్థిరంగా నిలిచి వుండిన హిమాలయాల పర్వత శ్రేణులలో ఈ ఉపద్రవం ఎందువల్ల? కైలాసం కోపగించుకోవడానికి కారణం ఏమిటి? దీనికి సమాధానం మనం గొప్పగా చెప్పుకొనే ఆర్థిక ప్రగతి మాత్రమే. హిమాలయాల నుంచి జాలువారే నదులు, జలపాతాలను జల విద్యుత్‌గా మార్చాలని ప్రభుత్వాలు చేసిన దురాశా పూరిత ప్రయత్నమే హిమాలయాల విధ్వంసానికి కారణం. ఎగువన వున్న కేదార్‌నాథ్ నుంచి దిగువన వున్న రుషికేష్ వరకు 245 జలవిద్యుత్ కర్మాగారాలు నిర్మితమౌతున్నాయి. వాటి కోసం కొండలు తొలిచి, సొరంగాలు ఏర్పరుస్తున్నారు. ఈ సొరంగాల వల్ల కొండ పునాదులు కదిలిపోతున్నాయి. కొన్ని లక్షల ఎకరాలలో అడవులను నేల మట్టం చేస్తున్నారు. దానితో పై నుంచి శరవేగంతో క్రిందకు జాలు వారే వర్షపు నీటి ప్రవాహాన్ని నియంత్రించే ప్రకృతిసిద్ధ ఏర్పాటు ధ్వంసమై వరదలు ముంచెత్తు తున్నాయి. మూడేళ్ల క్రితం కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ నివేదిక ఈ ఉత్పాతాన్ని వూహించింది. కానీ ప్రభుత్వం మేలుకోలేదు. జల విద్యుత్ వల్ల వచ్చే ఆర్థిక లాభాన్ని మాత్రమే పరిగణనలోకి తీసుకొని, ప్రకృతి విధ్వంసాన్ని యదేచ్ఛగా కొనసాగించింది. దాని దుష్ఫలితమే ఈ వినాశనం. ఇప్పటికైనా ప్రకృతి నాశనం ద్వారా లాభాలు మూట కట్టుకోవాలనే దురాశ మానుకొంటే ఇటువంటి ఉత్పాతాలు తప్పవు.

జమీన్‌రైతు

# జనవాణి

## రామతీర్థం రోడ్డు బాగు చెయ్యండి!

గత కొన్నేళ్లుగా కొడవలూరు మండలంలోని పద్మనాభ సత్రం నుంచి రామతీర్థం వరకు వెళ్లే ఆర్‌అండ్‌బి రోడ్డు బాగా దెబ్బతినిపోయింది. మోకాటి లోతు గుంటలు పడి వాహనాల్లో వెళ్లేవారి ఒళ్లు హూనమైపోతూంది. రామతీర్థంలో రామలింగేశ్వరుడు, తుమ్మగుంటలో అయ్యప్పస్వాముల దేవస్థానాలున్నాయి. నిత్యం భక్తులు ఈ ఆలయాలకు వెళ్తుంటారు. మత్స్యకారులు ప్రతి నిత్యం సముద్ర ఉత్పత్తులు అమ్ముకోను ఈ రోడ్డుపైనే రావాలి. త్వరలో రామతీర్థంలో స్వామి బ్రహ్మోత్సవాలు జరగబోతున్నాయి. ఈ సందర్భంగా జరిగే సముద్ర స్నానానికి లక్షలాది మంది భక్తులు వస్తారు. ఈలోపుగా ఈరోడ్డు మరమ్మత్తులు చేయమనవి.

*బి.పట్టాభిరామయ్య* నెల్లూరు

## మూలాపేటలో పోస్టాఫీసు పెట్టండి!

నెల్లూరు మూలాపేట బ్రాహ్మణవీధిలో ఉండిన పోస్టాఫీసు పౌరులకు ఎంతో ఉపకరిస్తుండినది. దానిని జనవరి 2012లో ఎత్తివేశారు. పోస్టాఫీసు లేక ఈ 17నెలలుగా జనం నానా అవస్థలు పడుతున్నారు. ఎంఓలు, ఎన్‌బిలు తుదకు కార్డు ముక్క పోస్టు చేయాలన్నా దిక్కులేదు. ఇంత పెద్ద మూలాపేటలో వారికి బిల్డింగు దొరకలేదని సాకు చెబుతున్నారు. పోస్టల్ సూపరింటెండెంట్ చొరవ తీసుకొని మూలాపేటలో ఓ పోస్టాఫీసు ఏర్పాటు చేయగలరని కోరుతున్నారు.

*శారదాకుమార్* నెల్లూరు

## ముదనష్టంగా మునిసిపల్ నీళ్లు!

నెల్లూరు టౌన్ దక్షిణం చంద్రమౌళినగర్‌లో నున్న మునిసిపల్ కొళాయిలలో వస్తున్న మంచి నీరనబడేవి డ్రైనేజి వాసనలతో కుళ్లు కంపుతో ఘుమఘుమలాడుతున్నాయి. వీటిని తాగలేక పోతున్నాము. మునిసిపల్ వాటర్‌వర్క్స్ సిబ్బంది, ఉన్నతాధికారులు ఈ వ్యవహారమై ఉదాసీన వైఖరి ప్రదర్శిస్తే ఎట్లా?

*తూపిలి వనమాలి* నెల్లూరు

## రవాణా సౌకర్యాలు మెరుగుపడాలి!

54 డివిజన్లుగా విస్తరించిన పట్టణ జనాభాకు అనుకూలంగా నెల్లూరులో రోడ్ల విస్తరణ, రవాణా సౌకర్యాలు చోటు చేసుకోకపోవడం బాధాకరం. పోటాపోటీపడి హడావుడి సృష్టిస్తున్న టౌన్ బస్సులు, ఆటోల పద్మవ్యూహంలో ప్రజలు అల్లాడిపోవాల్సి వస్తుంది. సాధారణ బస్సులు తిరగలేని ప్రాంతాల్లో మినీ బస్సులు, వ్యాన్లు ప్రవేశపెట్టే ఏర్పాట్లు చేయాలి. మెమూరైళ్ల సంఖ్యను పెంచు కోవడంతోపాటు కొండాయపాళెం ప్రాంతంలో మరో రైల్వేస్టేషన్ ఏర్పాటుకు కేంద్ర మంత్రి కోట్ల సూర్యప్రకాష్‌రెడ్డిని నెల్లూరీయులైన తొమ్మిది మంది ఎమ్మెల్యేలు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

25-6-1943
పేజీలు:4 వెల:0-1-6అణాలు

### పశువుల పెద్ద ఉపద్రవం

ఏ ప్రక్క జూచినా మాంచి తరుణ వయస్సుగల కోడెలను విపరీతంగా కొని ఎగుమతి చేస్తున్నారు. ధరలు విపరీతంగా పెరిగిపోయినవి. ఇది వరకు రూ.100లు అమ్ముతుండిన కోడె ఇప్పుడు మూడు నాలుగు వందలమ్ముతున్నవి. కొందరు ధర వచ్చిందని అమ్ముకొని తిరుగా కొనడానికి లంగరందక దేబిరిస్తున్నారు. ఈలా కొద్ది కాలం సాగిందంటే ఒక్క పసరం కూడా కలికానికి కనిపించదు. వ్యవసాయ తరుణం దగ్గరకు వస్తున్నది. జాగ్రత్తపడకపోతే దెబ్బ తింటారు. ప్రభుత్వం వ్యవసాయానికి ఉపకరించే పశువులను మిలటరీ ఆహారానికుపయోగింపము అని ప్రకటించింది. ఈ సముద్ర మంతా మిలటరీ ఆశనానికి కాకపోతే మరెందుకు? ప్రభుత్వం వెంటనే కళ్లు తెరచి ఈ వెల్లువను అరికట్టకపోతే అధికాహారోత్పత్తి విధానం పరిహాస భాజనమైపోయి ప్రజలు తిండిలేక అల్లో లక్ష్మణా అని అల్లాడి వస్తుంది. కావున ప్రభుత్వం తక్షణం చర్యబుచ్చుకొని ఒక్క పసరాన్ని ఎల్ల దాటకుండా చేయవలసిందిగా కోరుచున్నాము.

### రాయలసీమ కరవు

రాయలసీమ కరవు భీషణ రూపంలో తాండవిస్తున్నది. కరవుకు తోడు మలేరియా జ్వరాలు, కలరా గూడా విజృంభించినాయి. కలరా బళ్లారి జిల్లాలో ఉగ్రరూపిణిగా తాండవిస్తున్నది. తినడానికి తిండిలేక పోవడంతోపాటు వైద్య సహాయం గూడా లేక ప్రజలు మలమల మాడుతున్నారు నల్లులలాగా. త్రాగటానికి మంచి నీరైనా లేవు. ఈ విధంగా రాయలసీమ వాసులు కఠోరమైన తీవ్ర బాధలకు గురియౌతుంటే ఆ ప్రజల రక్షణకు ప్రభుత్వం తగినంతగా కృషి చేయక పోవడం గర్హనీయం.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

21-6-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### టెరిష్కోవా - కీలర్!

ఈ వారంలో ఇరువురు వనితలు ప్రపంచ దృష్టిని ఆకర్షించారు. అందులో సోవియెట్ స్త్రీ వాలెంటినా టెరిష్కోవా వ్యోమగామినిగా 2 రోజులు 2 గంటల 50 నిమిషాల సేపు ఆకాశంలో 12,40,000 మైళ్లు విహరించి, ప్రపంచం చుట్టూ 49 సార్లు ప్రదక్షిణంజేసి, ప్రప్రథమ వ్యోమగామినిగా రష్యాకు, యావత్ వనితాలోకానికి ఖ్యాతిని గూర్చింది.

అప్పరసగా పేరుపొందిన క్రిస్టిని కీలర్ ఇటు బ్రిటీష్ యుద్ధ మంత్రితోను, అటు రష్యన్ ఉద్యోగితోను ఏకసమయంలో ప్రేమ కలాపాలు సాగించి, యుద్ధ మంత్రిని పదచ్యుతునిజేసి, మాక్మిలన్ మంత్రాంగానికే ఎసరుపెట్టి బ్రిటిష్ ప్రజలకు, నారీలోకానికి తలవంపులు తెచ్చింది. ఈ అందాల రాణితో పాకిస్థాన్ ప్రెసిడెంటు అయాబ్‌ఖాన్ గూడా జలక్రీడలాడాడట.

### గోపాలరెడ్డి గోష్టి

రేడియో సమాచార శాఖామాత్యులు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి గారు 15వ తేది సాయంకాలం 'జమీన్‌రైతు'కు విచ్చేసిన సందర్భంలో పత్రికా రచయితల, కవుల ఇష్టాగోష్టి రెండు గంటలకు పైగా రసవత్తరంగా జరిగింది. సాహిత్య అకాడమీ మొదలు సినిమా రంగం వరకు రాజకీయాలు తప్ప అన్ని విషయాలు ప్రస్తావనకు వచ్చాయి. ఆనాటి సాయంకాలం అసాధారణమైన గోపాలరెడ్డి గారి ప్రసన్నతావైఖరి అందరికీ అచ్చెరువు గొలిపింది.

ఆహుతులకు 'జమీన్‌రైతు' టీ యిచ్చింది.

# నెల్లూరు ముచ్చట్లు విశేషాలు

## దేశ సమగ్రత గూర్చి వివరించాలి!

దేశ సమగ్రత గూర్చి విద్యార్థులకు నొక్కి చెప్పాల్సిన అవసరం ఎంతైనా వుందని బిజెపి జాతీయ నాయకుడు వెంకయ్యనాయుడు చెప్పారు. 15వ తేది స్వర్ణ భారత్ ట్రస్ట్‌లో ఏర్పాటుచేసిన ప్రతిభకు పురస్కారం–2013 కార్యక్రమంలో ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. దేశంలో విలువలతో కూడిన విద్య అవసరం ఎంతో వుంది. కుల, మత, విభేదాలతో జనాన్ని చీల్చేస్తున్నారు. విద్యార్థుల్లో సామాజిక స్పృహ కల్గించి వారిని చైతన్యవంతులను చేయాల్సిన అవసరం ఎంతైనా వుందన్నారు. అనంతరం పదవ తరగతి పరీక్షల్లో ప్రతిభ చూపిన 73 మంది విద్యార్థులకు నగదు బహుమతులు, మెమొంటోలు, ప్రశంసాపత్రాలు అందజేశారు. ఆడిటర్, ప్రముఖ రాజకీయ విశ్లేషకుడు ఎస్.గురుమూర్తి, దీపావెంకట్, స్వర్ణభారత్ ట్రస్ట్ సిఇఓ శరత్‌బాబు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## గాయపడ్డ నెల్లూరు మునిసిపల్ కమిషనర్!

నెల్లూరు కార్పొరేషన్ కమిషనర్ జాన్ శ్యాంసన్ 15వ తేది చిల్లకూరుకు సమీపంలోని బూదనం వద్ద జరిగిన రోడ్డు ప్రమాదంలో గాయపడ్డారు. నెల్లూరు నుంచి రేణిగుంటకు వెళ్తుండిన కమిషనర్ కారు బూదనం వద్ద లారీని ఓవర్ టేక్ చేయబోయి ప్రక్కన నిలిపి ఉన్న బస్సును ఢీ కొట్టింది. ఈ ఘటనలో కమిషనర్‌తోపాటు ఆయన సహాయకుడు బహదూర్, డ్రైవర్ రియాజ్ స్వల్పంగా గాయపడ్డారు.

## అరెస్టులు ఘనం – స్వాధీనం స్వల్పం!

నెల్లూరు రూరల్ పోలీసులు 16వ తేది యనమలవారిదిన్నె, మిట్టపాళెం ప్రాంతాల్లో పేకాట స్థావరాలపై దాడులు చేసి 27 మందిని పట్టుకొన్నారు. కానీ వీరి వద్ద నుంచి 4,200 రూపాయలు మాత్రమే స్వాధీనం చేసుకొన్నట్లు ప్రకటించడం విమర్శకు దారితీసింది.

## రూరల్ డిఎస్పీకి అదనపు బాధ్యతలు

జిల్లా పోలీసు అడ్మినిస్ట్రేటివ్ అధికారిగా నెల్లూరు రూరల్ డిఎస్పీ బాలవెంకటేశ్వరరావు అదనపు బాధ్యతలు స్వీకరించారు. అదనపు డిఎస్పీగా పనిచేస్తుండిన ఎల్.టి.చంద్రశేఖర్ ఇటీవల బదలీ అయ్యారు. ఆయన బాధ్యతలు మోస్తుండిన ఏఆర్ అదనపు ఎస్పీ ఐఆర్ఎస్ మూర్తి బందోబస్తు నిమిత్తం రాష్ట్ర రాజధానిలో ఉండడంతో జిల్లా పోలీసు అడ్మినిస్ట్రేటివ్ అధికారి బాధ్యతలు బాలవెంకటేశ్వరరావు తీసుకోవాల్సి వచ్చింది.

## గూడూరు ఆర్డీఓగా మధుసూధన్‌రావు!

గూడూరు ఆర్డీఓగా ఎన్.మధుసూధన్‌రావును నియమిస్తూ 17వ తేది ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. ఈయన కడప కలక్టరేట్‌లో స్పెషల్ డిప్యూటీ కలెక్టర్‌గా విధులు నిర్వహించేవారు. గతంలో గూడూరు సబ్ కలెక్టర్‌గా పనిచేసిన నివాస్‌ను మాటవినలేదని పనబాక కృష్ణయ్య బదలీ చేయించారని పబ్లిక్ టాక్.

## పోలీసు లీగల్ అడ్వైజర్!

పోలీసుల లీగల్ అడ్వైజర్‌గా సినియర్ న్యాయవాది వి.రామ్మోహన్‌రావును ఎస్పీ బి.వి.రమణకుమార్ నియమించారు. పోలీసు శాఖా సంబంధంగా అవసరమైన న్యాయ సహాయం, సూచనలు, సలహాలతోపాటు కోర్టు కేసుల్లో పోలీసుల తరపున ఆయన ఇక నుంచి వాదిస్తారు.

## పెద్దాసుపత్రిలో యునాని వైద్యం!

నెల్లూరు పెద్దాసుపత్రిలో యునాని వైద్య విభాగం ఉన్నా చాలా రోజులుగా డాక్టర్ లేదు. దీంతో వెంకటాచలం ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో యునానీ విభాగం వైద్యాధికారిగా పనిచేస్తున్న సయ్యద్ పర్వీన్‌ను ఇన్‌ఛార్జ్ వైద్యాధికారిగా నియమించారు. ఈమె వారంలో మూడు రోజులు పెద్దాసుపత్రిలో మరో మూడు రోజులు వెంకటాచలం పిహెచ్‌సిలో పని చేస్తారు.

## నిద్రమేల్కొన్న పౌరసరఫరాల శాఖ!

పౌరసరఫరాల శాఖ అధికారులు ఆలస్యంగా నిద్ర మేల్కొన్నారు. 17వ తేది నగరంలోని రైసుమిల్లులపై ఆకస్మిక దాడులు నిర్వహించి అక్రమ నిల్వలను స్వాధీనం చేసుకొన్నారు. తడికలబజారు సెంటర్‌లోని సాయిభగవాన్ ట్రేడర్స్, శ్రీనివాస రైసు మిల్లులపై అధికారులు ఆకస్మిక దాడులు చేసి ఇందులో నిబంధనలకు విరుద్ధంగా ఉన్న ధాన్యం, బియ్యం, నూకల నిల్వలను స్వాధీనం చేసుకొన్నారు. వీటిలో కిలో రూపాయి బియ్యం కూడా ఉన్నాయి. వీటి విలువ 9.52 లక్షలుగా అధికారులు గుర్తించి మిల్లుల యజమానులపై 6ఏ కేసు నమోదు చేశారు.



## హిమ్ సుకన్య అరెస్టు

హిమ్ సంస్థ ఏర్పాటుచేసి మనీ స్కీం పేరుతో కోట్లాది రూపాయలు వసూలుచేసి దగాచేసిన జాన్ ప్రభాకర్ భార్య, ఆ సంస్థ కోశాధికారి సుకన్య ఎట్టకేలకు సిబిడి పోలీసులకు చిక్కింది. ఈ కేసులో కీలక పాత్రధారియైన ఆమె కోసం చాలాకాలంగా సిబిడి గాలిస్తోంది. చెన్నైలో విలాసవంతమైన జీవితం అనుభవిస్తున్న ఆమె పోలీసుల నుంచి తప్పించుకొని రహస్య జీవితం గడుపుతోంది. చంద్రగిరిలోని మారుమూల పల్లెలో ఓ టైలర్ వద్ద జాకెట్లకు హుక్స్‌వేస్తూ బతుకుతుండిన ఆమెను పసిగట్టిన సిబిడి పోలీసులు అరెస్టు చేశారు. కీలక వ్యక్తి దొరకడంతో ఈ కేసు ఒక కొలిక్కి వస్తుందని భావిస్తున్నారు.



కలెక్టరేట్‌లో జిల్లా వైద్య ఆరోగ్య శాఖ అధికారులతో సమీక్షా సమావేశం నిర్వహిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి. ప్రక్కన అదనపు జెసి పెంచలరెడ్డి, ఇన్‌ఛార్జి డిఎంఅండ్‌హెచ్ఓ డాక్టర్ సుధాకర్. పెద్దాస్పత్రుల సమన్వయకర్త డాక్టర్ నిర్మలమ్మ, డిఆర్వో రామిరెడ్డి.

## కావలి రైల్వేస్టేషన్‌కు బాంబు బెదిరింపు

కావలి రైల్వేస్టేషన్‌లో బాంబు వున్నట్లు బెదిరింపు రావడంతో కలకలం రేగింది. రైల్వేస్టేషన్ మాస్టర్ పేరుతో అగంతకుడు బాంబు పెట్టినట్లు లేఖ వ్రాయడంతో భయపడి పోయారు. ఈ సమాచారాన్ని రైల్వే ఉన్నతాధికారులకు తెలపడం, వారు ఎస్పీకి తెలియజేయడంతో బాంబు స్క్వాడ్ స్టేషన్‌లో అడుగడుగునా తనిఖీలు నిర్వహించింది. బాంబులాంటివి ఏవీ లేకపోవడంతో అందరూ ఊపిరి పీల్చుకొన్నారు. ఎవరో కావాలని చేసిన పనిగా భావించిన పోలీసులు దీనిపై దర్యాప్తు చేపట్టారు.

## 10 సీట్లు టిడిపినే గెలుస్తుంది!

వచ్చే శాసనసభ ఎన్నికల్లో జిల్లాలో పది శాసనసభ స్థానాలను తెలుగుదేశం పార్టీ కైవసం చేసుకొంటుందని ఆ పార్టీ సీనియర్ నేత గోరంట్ల బుచ్చయ్య చౌదరి విశ్వాసం వ్యక్తం చేశారు. ఇటీవల నగరానికి వచ్చిన ఆయన విలేకరులతో మాట్లాడుతూ ప్రజలు తెలుగుదేశం పార్టీ పట్ల ఆదరణ చూపుతున్నారన్నారు. చంద్రబాబు నాయుడు చేపట్టిన సుదీర్ఘ పాదయాత్ర మంచి ఫలితాన్ని ఇస్తుందన్న ఆశాభావం వ్యక్తం చేశారు. కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలను ప్రజలు నమ్మే స్థితిలో లేరన్నారు.

## తెలుగులో తీర్పునిచ్చిన కావలి న్యాయమూర్తులు

కావలి కోర్టులో తొలిసారిగా మూడు కేసుల్లో ముగ్గురు న్యాయమూర్తులు తెలుగులో తీర్పునిచ్చి ఆదర్శంగా నిలచారు. సీనియర్ సివిల్ జడ్జి, ప్రిన్సిపల్ జూనియర్ సివిల్ జడ్జి, అదనపు జ్యుడిషియల్ మెజిస్ట్రేట్‌లు గురప్ప, వెంకటాద్రి, మహ్మద్ నజీర్‌లు వివిధ కేసులకు సంబంధించి 17వ తేది వెలువరించిన తీర్పులను అందరికీ అర్థమయ్యేలా తెలుగులో ఇవ్వడం పట్ల అందరూ అభినందనలు తెలిపారు.

## శబరి ఎక్స్‌ప్రెస్‌లో దోపిడీ

త్రివేండ్రం నుంచి సికింద్రాబాద్ వెళ్తున్న శబరి ఎక్స్‌ప్రెస్‌లో నెల్లూరు సమీపంలో దోపిడీ జరిగింది. ఈ రైలు పడుగుపాడు ప్రాంతానికి వచ్చిన సమయంలో రైల్లో వున్న మహిళల మెడల్లోని నగలు లాక్కొని దొంగలు రైలు నుంచి దూకేశారట. ఈ హఠాత్ పరిణామం నుంచి తేరుకున్న బాధితులు రైల్వే పోలీసులకు సమాచారం అందించడంతో వారు గాలింపు జరిపారు. ఇటీవల రైళ్లలో దొంగతనాలు, దోపిడీలు పెరిగి పోతుండడంపై ప్రయాణీకులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

## ఉత్తుత్తి తనిఖీలు

అధికారులు నగరంలోని సినిమా హాళ్లపై చేసిన తనిఖీలు ఉత్తుత్తి తనిఖీలుగానే మారుతున్నాయి. ఇటీవల రెవిన్యూ అధికారులు జాయింట్ కలెక్టర్ ఆదేశా

కొరవ 14వ పేజీలో

# ముస్లింలకు వైఎస్ ఎంతో చేశారు!

## ● వైకాపా నెల్లూరు సిటీ సమన్వయకర్త అనిల్



ఇస్లాంపేటలో ప్రజాదీవెన కార్యక్రమంలో అనిల్.

దేశంలో కాంగ్రెస్ పార్టీ అధికారంలో ఉన్న ఏ రాష్ట్రంలోలేని విధంగా మన రాష్ట్రంలో దివంగత మహానేత డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముస్లిం మైనార్టీల కోసం నాలుగు శాతం రిజర్వేషన్ కల్పించి వారి జీవితాలలో వెలుగులు నింపారని నెల్లూరు నగర వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సమన్వయ కర్త డాక్టర్ పి.అనిల్‌కుమార్ యాదవ్ అన్నారు. ప్రజా దీవెనలో భాగంగా 1వ డివిజన్‌లోని ఇస్లాంపేటలో పర్యటించి మాట్లాడారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ విధి విధానాలు తెలిపేందుకు గడప గడపకు వెళ్తుంటే ప్రజలు బ్రహ్మరథం పడుతున్నారు. మహానేత డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అందించిన సంక్షేమ పథకాల వల్ల తాము ఎంతగానో లబ్ధిపొందామని, ఆయన చేసిన మేలు ఎన్నటికీ మరువలేమని, ఆయన తనయుడు వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని ఎప్పుడు ఎన్నికలు వచ్చినా ముఖ్యమంత్రి చేసి ఆ మహానేత రుణం తీర్చుకొంటామని చెబుతున్నారు. జగన్మోహన్‌రెడ్డిని రాజకీయంగా ఎదుర్కోలేక కాంగ్రెస్ ప్రభుత్వం కుళ్లకుతంత్రాలతో జైలులో నిర్బంధించి ఈ రాష్ట్ర ప్రజలకు దూరం చేసిందన్నారు. తొమ్మిదేళ్ల రాష్ట్రాన్ని పరిపాలించిన చంద్రబాబునాయుడు ముస్లిం మైనార్టీలకు చేసి పెట్టిందేమీ లేదన్నారు. ఇప్పుడేమో అధికారం కోసం ముస్లిం మైనార్టీలకు ఎంతో చేస్తానని మాయమాటలు చెబుతున్నారని విమర్శించారు. రాబోయే కార్పొరేషన్ ఎన్నికల్లో అన్ని డివిజన్లను వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ వశం చేసుకొని మునిసిపల్ కార్పొరేషన్ మీద వైఎస్ ఆర్ కాంగ్రెస్ పార్టీ జెండా ఎగురవేస్తామని అనిల్‌కుమార్ ధీమా వ్యక్తం చేశారు.

# ఎపిఆర్‌జెసిలో జిల్లా ఫస్ట్ జడ్ఎస్ఆర్!

నెల్లూరు జేమ్స్‌గార్డెన్స్‌లోని న్యూ నేతాజి(జడ్ఎస్ఆర్) టాలెంట్ స్కూల్ విద్యార్థులు ఎపిఆర్‌జెసి ఫలితాల్లో రికార్డుల మోత మోగించారు. వి.సుమన్ ఎమ్పీసి గ్రూప్‌లో జిల్లాలో మొదటి ర్యాంకు, రాష్ట్రస్థాయిలో 55వ ర్యాంకు సాధించాడు. పి.వి.బిందుభార్గవి ఎమ్పీసి గ్రూపులో జిల్లాలో రెండవ ర్యాంకు, రాష్ట్రస్థాయిలో 136వ ర్యాంకు తెచ్చుకున్నారు. కె.అనుదీప్‌కుమార్ ఎమ్పీసి గ్రూపులో రాష్ట్రస్థాయిలో 228, ఎన్.పవన్‌కుమార్ 334, ఎస్.హిమశ్రీ 337వ ర్యాంకు, పి.అనూష బైపిసి గ్రూప్‌లో జిల్లాలో మొదటి ర్యాంకు, రాష్ట్రస్థాయిలో 32వ ర్యాంకు, జి.రవితేజారెడ్డి బైపిసి గ్రూపులో జిల్లా మూడవ ర్యాంకు, రాష్ట్రస్థాయిలో 119వ ర్యాంకు సాధించాడు. పి.తులసి సిజిడిఎం గ్రూపులో జిల్లాలో మొదటి ర్యాంకు, రాష్ట్రస్థాయిలో ఆరవ ర్యాంకు సాధించాడు. డిగ్రీ స్థాయిలో జరిగిన ఎపిఆర్‌జెసి పరీక్షల్లో జడ్ రాజశేఖర్‌రెడ్డి రాష్ట్రస్థాయిలో రెండవ ర్యాంకు, జిల్లాస్థాయిలో మొదటి ర్యాంకు సాధించాడు. ర్యాంకులు సాధించిన విద్యార్థినీ, విద్యార్థులకు న్యూ నేతాజి స్కూల్ అధినేత జడ్.శ్రీనివాసులురెడ్డి అభినందించారు.

# ఊబకాయం ప్రాణాంతకం

## ● రోగ నిర్ధారణ శాస్త్రవేత్త డాక్టర్ పెంచలరెడ్డి



ఊబకాయం ఎయిడ్స్ కన్నా ప్రమాదమని ప్రముఖ రోగ నిర్ధారణ శాస్త్రవేత్త డాక్టర్ ఎం.పెంచలరెడ్డి అన్నారు. ఇందిరాభవన్‌లో తాను నిర్వహించే విజయ లాబొరేటరీ 28వ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని ప్రెస్‌క్లబ్‌లో విలేకరులతో మాట్లాడారు. ప్రస్తుతం మన జీవనశైలిలో గణనీయమైన మార్పు వచ్చిందని, ప్రజలు సుఖాలకు అలవాటుపడి బద్ధకస్తులుగా తయారవుతున్నారన్నారు. ప్రస్తుత ప్రపంచ జనాభా 720 కోట్ల మందిలో 100 కోట్ల మంది బి.పితో బాధ పడుతున్నారు. ప్రతి సంవత్సరం కొన్ని లక్షల మంది బిపితో మరణిస్తున్నారన్నారు. ఊబకాయం పొట్ట రోగాల పుట్టన్నారు. ఉన్నతవర్గాలకు చెందిన మహిళలలో 50 శాతానికి పైగా ఊబకాయులేనన్నారు. మహిళలలో 50 శాతం, పురుషులలో 50 శాతానికి పైగా ఊబకాయులున్నారన్నారు. జబ్బులు వచ్చినప్పుడు మందులు వాడడం కాదు. జబ్బులు రాకుండా చూసుకోవాలన్నారు. విజయ లేబొరేటరీకి అనుబంధంగా ఒబేసిటీ క్లినిక్ ప్రారంభించామని డైట్ థెరపీ, ఎక్సర్‌సైజ్ థెరపీ, యోగాలలో శిక్షణ ఇస్తున్నామన్నారు. ఆరోగ్య నిలయం, ధన్వంతరి ఆరోగ్య ధామం, పతంజలి యోగాలయం, గాంధీజీ ఆశ్రమంలో శిక్షణనిస్తుందన్నారు. ఈ సమావేశంలో యోగా థెరపిస్ట్ ఎం.అరుణ, రోగ నిర్ధారణ శాస్త్రవేత్త డాక్టర్ విజయలక్ష్మి, చిన్న పిల్లల వైద్యుడు డాక్టర్ ఎం.రాజశేఖర్‌రెడ్డి పాల్గొన్నారు.

# యూనిఫారాలు అందేనా?

## ఈ యేడాది సందేహమే

పాఠశాలలు పునః ప్రారంభమయ్యాయి. ప్రభుత్వం, అధికారులు, ప్రాథమిక విద్యను బలోపేతం చేసేందుకు షరా మామూలుగా హామీలు గుప్పిస్తున్నారు, ప్రకటనలు చేస్తున్నారు, వివిధ కార్యక్రమాలు చేపడుతున్నారు. అంతవరకు బాగానే వున్నా ప్రభుత్వ పాఠశాలల్లో చదివే పేద విద్యార్థులకు ఈ ఏడాదైనా సక్రమంగా యూనిఫాం అందుతుందా అనే సందేహాలు వ్యక్తమవుతున్నాయి. పాఠశాలల్లో చదివే విద్యార్థులందరికీ ఒకే రకమైన దుస్తులు వుండాలని, ఇందులో పేద, ధనిక అన్న తారతమ్యం వుండరాదన్న ఉద్దేశంతో యూనిఫాంను ఏర్పాటు చేసింది ప్రభుత్వం. అయితే వీటిని సరఫరా చేయడంలో రకరకాల పద్ధతులు, నిబంధనలు ప్రవేశ పెట్టడంతో గత కొన్నేళ్లుగా పాఠశాలల్లోని విద్యార్థులకు సక్రమంగా యూనిఫాం అందడం లేదు. మొదట్లో ఆయా పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు యూనిఫాం బాధ్యతలను అప్పగించారు. ఆ తర్వాత బయట వ్యక్తుల చేత కాంట్రాక్టు పద్ధతిని కుట్టించుకోవాలని నిర్ణయించారు. ఈ విధానాన్ని మార్చి జిల్లాకు యూనిఫాం సరఫరా కాంట్రాక్టును ఆరు కంపెనీలకు అప్పగించారు. వీరు సకాలంలో విద్యార్థులకు సరఫరా చేస్తారా లేదా అనేది తేలాల్సి వుంది. మరోవైపు కాంట్రాక్టర్లు నాసిరకం మెటీరియల్‌తో యూనిఫాం తయారు చేస్తుండడంతో వేసుకొన్న కొద్ది రోజులకే కుట్లువూడిపోవడం, చీలికలు, పీలికలుగా అవుతున్నాయి. అధికారులు దీనిపై శ్రద్ధ వహించి నాణ్యమైన దుస్తులను యూనిఫాంగా అందించాలని సకాలంలో విద్యార్థులందరికీ అందేలా చూడాలని తల్లితండ్రులు, ఉపాధ్యాయులు కోరుకొంటున్నారు.

# విజయమ్మ కన్నీటికి మూల్యం చెల్లిస్తారు!

## ● కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి ఆవేదన

నెల్లూరు రూరల్ నియోజకవర్గ పరిధిలోని నగర ప్రాంతంలో వైకాపా సమన్వయకర్త కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి నిర్వహిస్తున్న డివిజన్ బాట కార్యక్రమంలో భాగంగా ప్రగతి నగర్‌లో పర్యటించారు. స్థానిక ప్రజలు పెద్ద ఎత్తున ఆయనకు ఘన స్వాగతం పలికి స్థానికంగా ఎదుర్కొంటున్న అధ్వాన్నపు పారిశుద్ధ్యం, దోమలబెడద, గుంటలమయంగా మారిన రోడ్ల గూర్చి ఆయనకు వివరించారు. ఈ సందర్భంగా కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ వైఎస్ మరణానంతరం ఆయన సంక్షేమ పథకాలకు స్వస్తి పలికిన నేటి దుర్మార్గపు కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజా సమస్యలను ఏమాత్రం పట్టించుకోవడం లేదన్నారు. వైఎస్ జగన్మోహన్‌రెడ్డిపై అక్రమ కేసులు బనాయించి జైల్లో పెట్టించిందని, వైఎస్ సతీమణి విజయమ్మ ఆవేదనతో కన్నీరు కారుస్తుంటే ఆ కన్నీరును సైతం కాంగ్రెస్ నాయకులు అవహేళన చేస్తూ మాట్లాడుతున్నారని, వైఎస్ విజయమ్మ కార్చే ప్రతి కన్నీటి బొట్టుకు కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు మూల్యం చెల్లించే రోజు రాబోతుందన్నారు. ఈ కార్యక్రమంలో షేక్ అజీజ్, ఖాదర్‌బాషా, యూసఫ్‌బాషా, నజీర్, అప్సర, ముజహర్, ముస్తఫా, హరి, మస్తాన్, షాహుల్, విజయ్, అశోక్, రవి పాల్గొన్నారు.



డివిజన్ బాటలో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి.

# పాఠశాలలు, హాస్టళ్లు మూత!

## కుంటిసాకులు చెబుతున్న అధికారులు

పాలకులు చెప్పే మాటలకు, ఇచ్చే హామీలకు, ఆచరణకు పొంతన వుండదం లేదన్న విషయం పలుమార్లు రుజువయ్యింది. తాజాగా జిల్లాలో సాంఘిక సంక్షేమ హాస్టళ్ల ఎత్తివేస్తుండడం, పలు ప్రభుత్వ పాఠశాలలకు మంగళం పలుకుతుండడంతో ఈ హామీలు నీటి మూటలేనన్న సంగతి మరోమారు తేటతెల్లం అవుతోంది. సాంఘిక సంక్షేమ హాస్టళ్లను బలోపేతం చేస్తున్నామని, అక్కడ చదివే పిల్లలకు మెరుగైన వసతులు కల్పిస్తామని, హాస్టళ్లను ఆధునీకరిస్తామని ఒకవైపు చెబుతూ, దాతల సహకారం కోరుతూ వాటిని అభివృద్ధి పరచేందుకు ఎంతగానో కృషి చేస్తున్నట్లు నటిస్తూ మరోవైపు మెల్లమెల్లగా హాస్టళ్లను ఎత్తివేసేందుకు రంగం సిద్ధం చేశారు. విద్యార్థి సంఘాలు, తల్లితండ్రులు దీనిపై ఆగ్రహం వ్యక్తం చేస్తుంటే, తమపై పడుతున్న అపప్రదను తొలగించుకొనేందుకు విద్యార్థులు లేరన్న సాకు చూపుతున్నారు. వీటిలాగే ప్రాథమిక పాఠశాలలను మూసివేసేందుకు సిద్ధమవుతున్నారు. విద్యార్థుల సంఖ్య తక్కువగా వుందంటూ జిల్లాలోని పలు ప్రాంతాల్లోగల ప్రాథమిక పాఠశాలలను మూసివేసి, అక్కడి ఉపాధ్యాయుల పోస్టులను రద్దు చేసేందుకు అన్నీ సిద్ధం చేసినట్లు సమాచారం. దీనికి పలు రకాల కారణాలు చెబుతోంది విద్యాశాఖ. ఒకవైపు ప్రైవేట్ పాఠశాలలకు ధీటుగా విద్యాబోధన చేస్తున్నామని, పాఠశాలలను బలోపేతం చేస్తున్నామని, అందుకోసం పలు రకాల కార్యక్రమాలు చేపడుతున్న పాలకులు, అధికారులు విద్యార్థుల సంఖ్య తక్కువగా వుందన్న సాకుతో పాఠశాలల రద్దుకు పూనుకోవడంపై సర్వత్రా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

● గూడూరు సబ్ కలెక్టర్

# ఆకస్మిక బదలీ!

## అధికార పార్టీ నేతలే కారణం

గూడూరు సబ్ కలెక్టర్ నివాస్ బదలీ అయ్యారు. సాధారణ బదలీలకు ఇంకా సమయం వుండగానే రాజకీయ కారణాలతో జరిగిన బదలీగా వ్యాఖ్యానిస్తున్నారు పలువురు. నివాస్ ఇక్కడ సబ్ కలెక్టర్‌గా బాధ్యతలు చేపట్టిన నాటి నుంచి చురుకుగా వ్యవహరిస్తున్నారు. పేదల సమస్యల పరిష్కారంలో, భూ ఆక్రమణలు అరికట్టడంలో, బాలకార్మిక వ్యవస్థను నిర్మూలించడంలో తనదైన ముద్ర వేశారు. ప్రజావిజ్ఞప్తుల దినంలో పేరుకుపోతున్న సమస్యలకు ఆయన సత్వర పరిష్కారం చూపారు. గూడూరు పట్టణంలో ఆక్రమణల విషయంలో ఎలాంటి ప్రలోభాలకు లొంగకుండా కఠినంగా వ్యవహరించారు. బజారువీధి, కుమ్మరివీధి, రాజావీధిలోని ఆక్రమణల తొలగింపునకు సన్నద్ధం అయ్యారు. ఆక్రమణ చెరచిక్కిన రెండు కోనేరులను ఆక్రమణల బారి నుంచి కాపాడి వాటికి కార్పొరేట్ సంస్థల సహకారంతో పూర్వ వైభవం తెచ్చారు. మున్సిపల్ ప్రత్యేకాధికారిగా వుంటూ గాడితప్పిన పురపాలనను సక్రమమార్గంలో నడిపించేయత్నం చేశాడు. ఈ క్రమంలో బదలీ జరిగే రెండురోజుల ముందు సక్రమంగా పని చేయని ఇరువురు అధికారులను సస్పెండ్ చేశారు. రాజకీయాలకు దూరంగా వుంటూ ప్రజలకు దగ్గరగా మసలుతున్న సబ్‌కలెక్టర్ పనితీరు ఇబ్బందిగా పరిణమించిందని భావించిన కొందరు అధికారపార్టీ నేతలు ఆయన్ను ఆకస్మికంగా బదలీ చేయించినట్లు ప్రచారం జరుగుతోంది. స్థానిక సంస్థల ఎన్నికల్లో ఇలాంటి అధికారి వుంటే తమ పప్పులు ఉడకవని భావించే ఈ బదలీ జరిపించినట్లు సమాచారం. నివాస్‌ను ఉట్నూరు ఐటిడిఏ పివోగా బదలీ చేశారు.

● సాహసం చేసిన

# రీజనల్ ఇంటర్మీడియట్ ఆఫీసర్!

**గూడూరు నారాయణ కాలేజికి సీలు**

నిబంధనలకు విరుద్ధంగా నడుస్తున్న గూడూరులోని నారాయణ కళాశాలను అధికారులు సీజ్ చేశారు. గత ఏడాది ఈ కళాశాలను ప్రారంభించినప్పటికి కళాశాల ఏర్పాటుకు ప్రభుత్వ అనుమతులు లేవట. దీనిపై పలు విద్యార్థిసంఘాలు పలుమార్లు ఆందోళన జరిపి అధికారులకు ఫిర్యాదు చేశాయి. అక్కడ చదువుతున్న విద్యార్థుల భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని అధికారులు గత ఏడాది ఎలాంటి చర్యలు చేపట్టలేదు. ఈ ఏడాది విద్యా సంవత్సరం ప్రారంభం కావడం, కొత్తగా విద్యార్థులు చేరుతుండడంతో తిరిగి మరోసారి ఎబివిపి స్పందించి ఇంటర్మీడియట్ అధికారులకు సమాచారాన్ని అందించాయి. దీంతో ఆర్ఐఓ పరంధామయ్య కాలేజిపై దాడి చేసి ఎలాంటి అనుమతులు లేని కారణంగా కాలేజిని మూసివేస్తున్నట్లు ప్రకటించి కళాశాలకు సీల్ వేశారు. ఈ వ్యవహారం కలకలం రేపింది. అధికారులు ఇదే జోరు కొనసాగిస్తే మరిన్ని పెద్ద కళాశాలల భాగోతం బట్టబయలవుతుందని ప్రజలు వ్యాఖ్యానిస్తున్నారు.

# మీసేవా కేంద్రాల్లో లోపించిన సేవలు!

మీ సేవా కేంద్రాల ద్వారా ఆదాయ, నివాస, కుల ధృవీకరణ, కరెంటు బిల్లులు, జనన మరణ సర్టిఫేకేట్‌లు ఎక్కువసార్లు తిరగకుండా, ఎక్కువ సమయం వేచివుండకుండా సులభంగా, వేగంగా పొందవచ్చని ఊదరగొట్టింది. ప్రజలు మీసేవా కేంద్రాల ఏర్పాటుతో రెవెన్యూ కార్యాలయాల చుట్టూ తిరిగే బాధ తొలగుతుందనుకొన్నారు. కానీ వాస్తవానికి పరిస్థితి అందుకు విరుద్ధంగా వుంది. గంటల తరబడి క్యూలో నిల్చొన్నా సర్టిఫికేట్‌లు అందడం లేదు. జిల్లాలోని వివిధ ప్రాంతాలలో ప్రజలు ఇలాంటి సమస్యలనే ఎదుర్కొంటున్నారు. జిల్లా వ్యాప్తంగా మొత్తం 222 మీసేవా కేంద్రాల్లో ఇదే పరిస్థితులు కొనసాగుతున్నాయి.

● కలకలం సృష్టించిన

# చిరంజీవిరెడ్డి ఆత్మగౌరవ సభ!

## వేలాదిగా తరలివచ్చిన మద్దతుదారులు



సభలో మాట్లాడుతున్న చిరంజీవిరెడ్డి.

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో ముసలం పుట్టింది. ఇటీవల పార్టీ నుండి సస్పెన్షన్‌కు గురైన నేతలు కలిగిరి మండలంలో ఆత్మగౌరవసభ పేరిట భారీగా జనాన్ని సమీకరించి మేకపాటి సోదరులపై తీవ్రస్థాయిలో ధ్వజమెత్తడం ఆ పార్టీ వర్గాల్లో కలకలం సృష్టించింది. సహకార ఎన్నికల్లో పార్టీకి వ్యతిరేకంగా పని చేశారని మొట్టుకూరు చిరంజీవిరెడ్డి, కర్తం శ్రీనివాసులరెడ్డి, మాలెపాటి వెంకటసుబ్బయ్యలను పార్టీ అధిష్టానం సస్పెండ్ చేసింది. మేకపాటి శేఖర్‌రెడ్డి చేసిన ఫిర్యాదుతో ఈ చర్యలు చేపట్టింది. దీంతో పార్టీలో కలకలం రేగింది. కాకాణి వర్గీయులుగా ముద్రపడ్డ చిరంజీవిరెడ్డి తదితరులపై వేటు వేయడంతో ముఠా కుమ్ములాటలు మరోసారి బయటపడ్డాయి. మేకపాటి సోదరులే పనిగట్టుకొని సస్పెండ్ చేయించారని బాహాటంగా ఆరోపించిన చిరంజీవిరెడ్డి తదితరులు ఇటీవల కలిగిరి ఆర్‌అండ్‌బి గెస్టు హౌస్ సమీపంలో భారీ బహిరంగ సభ నిర్వహించారు. మేకపాటి సోదరుల రౌడీయిజాన్ని, అరాచకాలను సాగనివ్వమని తీవ్రస్థాయిలో మాట్లాడారు. వైకాపాను ఇంట్లోపార్టీగా మార్చుకొని భూస్థాపితం చేస్తున్నారని విమర్శలకు దిగారు. ఇక నుంచి రాజన్న దళంగా ఏర్పడి పోరాటం చేస్తామని చిరంజీవిరెడ్డి, శ్రీనివాసులరెడ్డి, వెంకటసుబ్బయ్యలు బహిరంగంగా హెచ్చరించారు. జరగబోయే ఎన్నికల్లో మా సత్తా చాటుతామని తెలియజెప్పారు. మేకపాటి సోదరుల కారణంగానే కావలిలో రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి ఓడిపోయాడని, రాజమోహన్‌రెడ్డి జగన్‌ను, విజయమ్మను నోటికొచ్చినట్లు మాట్లాడారని దుయ్యబట్టారు. ఈ సభకు కలిగిరి, కొండాపురం, జలదంకి మండలాల నుంచి భారీగా జనం తరలిరావడంతో ఆత్మగౌరవసభ సక్సెస్ అయ్యింది. దీని ప్రభావం పార్టీపై ఎట్లా వుంటుందో చూడాలి.

# దీనావస్థలో వెంకటరెడ్డి పల్లె రైతులు!

● ఫ్యాక్టరీ ఏర్పాటు పేరిట భూములు లాక్కున్నారు

ఫ్యాక్టరీ ఏర్పాటు పేరుతో భూములు సేకరించి ఆయా కుటుంబాలకు ఉద్యోగలిస్తామని చెప్పి బంగారంలాంటి భూములను తీసుకొని మూడేళ్లు గడుస్తున్నా ఇప్పటివరకు ఫ్యాక్టరీ నిర్మాణానికి సంబంధించి చిన్న పని జరగకపోవడంతో రైతులు గగ్గోలు పెడుతున్న వైనం ఓజిలి మండలం వెంకటరెడ్డిపల్లెలో చోటు చేసుకొంది. ఈ ప్రాంతంలో టాప్ మెటల్ లిమిటెడ్ కంపెనీ పేరుతో ఉక్కు పరిశ్రమను ఏర్పాటు చేసేందుకు 2010లో ఈ గ్రామంలోని సన్నకారు రైతుల నుండి 75.17 ఎకరాల భూమిని ప్రభుత్వం సేకరించింది. అందుకుగాను కంపెనీ నిర్వాహకులు రైతులకు 42లక్షల రూపాయలు చెల్లించేలా ఒప్పందం కుదుర్చుకున్నప్పటికీ ఇప్పటివరకు రైతులకు అందలేదట. దీనికి తోడు భూములు సేకరించి మూడేళ్లు గడుస్తున్నా ఇంతవరకు ఆ స్థలంలో ఫ్యాక్టరీ యాజమాన్యం ఒక తట్ట మట్టి పని చేసిన దాఖలాలు లేవు. దీంతో రైతులు పరిస్థితిని కలెక్టర్‌కు వివరించారు. స్పందించిన కలెక్టర్ దీనిపై విచారణ జరిపించి ఫ్యాక్టరీ యాజమాన్యం ఎలాంటి పనులు జరపలేదని తెలుసుకొని ఆ భూములను తిరిగి రైతులకు అప్పగించాలని పరిశ్రమల శాఖకు లేఖ వ్రాశాడు. భూముల కోల్పోయి, జీవనోపాధి కోల్పోయిన రైతులు భూములు ఎప్పుడు తమ స్వాధీనం అవుతాయోనని ఎదురు చూడాల్సిన పరిస్థితులు నెలకొంటున్నాయి.

● ఆర్యవైశ్య మహాసభ

# రాష్ట్ర కార్యవర్గ సభ్యునిగా సుబ్బరాయుడు!

## మూడవసారి ఎన్నిక



రాష్ట్ర ఆర్యవైశ్య మహాసభ కార్యవర్గ సభ్యుడిగా కావలి పట్టణానికి చెందిన అమరా వేదగిరి సుబ్బరాయుడు గుప్తా ఎన్నికయ్యారు. ఈ పదవికి ఆయన ఎంపిక కావడం ఇది ముచ్చటగా మూడోసారి. రెండు వేల మందికిపైగా సభ్యులను చేర్పించి ఆర్యవైశ్య మహాసభలో ప్రత్యేక గుర్తింపు పొందాడు. 2010లో మొట్టమొదటి కార్యవర్గ సభ్యుడిగా ఎన్నికైన అమరా ఆనాటి నుంచి ఇప్పటి వరకు వరుసగా ఎంపికవుతూ వుండడం ఆయన కార్యదక్షతకు నిదర్శనం. ఈమేరకు ఆర్యవైశ్య మహాసభ రాష్ట్ర అధ్యక్షుడు కాళ్లకూరి శ్రీరాం నాగేశ్వరరావు నియమక పత్రాలు అందజేశారు. ఈ సందర్భంగా వేదగిరి సుబ్బరాయుడు మాట్లాడుతూ తనను గుర్తించి మూడోసారి బాధ్యతలు అప్పగించినందుకు ఆర్యవైశ్య మహాసభకు కృతజ్ఞతలు తెలిపారు. ఆర్యవైశ్యుల అభివృద్ధికి తనవంతు కృషి చేస్తానన్నారు. తనకు సహకరించిన శ్రీరాం నాగేశ్వరరావు, ముక్కాల ద్వారకానాథ్, నాగేశ్వరరావు, గ్రంధి యానాదిశెట్టికి ఆయన కృతజ్ఞతలు తెలిపారు.

# ముదనష్టంగా పొదలకూరు

ఎక్కడ చూసినా పేరుకపోయిన చెత్త, పందుల సంచారంతో ముదనష్టంగా తయారైంది పొదలకూరు పంచాయితీ. 20వేలకుపైగా జనాభా వున్న ఈ పంచాయితీలో పారిశుధ్యం పూర్తిగా క్షీణించి అస్తవ్యస్త పరిస్థితులు నెలకొంటున్నా పట్టించుకొనే నాధుడే లేకుండాపోయారు. పాలకులు, అధికారులు, ప్రత్యేకాధికారులు ఇలా ఎందరు మారినా, ఎవరు వచ్చినా పంచాయితీ పరిస్థితుల్లో, పారిశుధ్యంలో ఏమాత్రం మార్పురాకపోగా నానాటికి దిగజారిపోతుండడంపై ప్రజలు తీవ్ర ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. మురుగునీటి కాలువల్లో చెత్తపేరుకపోయి నీరు వెళ్లే మార్గం లేక రోడ్లపైకి పొంగిపొర్లుతున్నాయి. ఇక చెత్తను ఎత్తివేసేవాళ్లు లేకపోవడంతో రోజుల తరబడి చెత్తపేరుకపోయి ఎక్కడ చూసినా చెత్తకుప్పలే వుంటున్నాయి. వీటికి పందులు తోడవడంతో అవి చెత్తను చెల్లాచెదురు చేస్తుండడంతో దుర్గంధానికి స్థానికులు నరకం చవి చూస్తున్నారు. ఈ పరిస్థితుల్లో ఎక్కడ అంటురోగాలు ప్రబలుతాయో, ఎక్కడ అనారోగ్యానికి గురికావాల్సి వస్తుందోనని పంచాయితీ ప్రజలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఇప్పటికైనా అధికారులు శ్రద్ధ చూపి పారిశుధ్య పరిస్థితులు మెరుగుపరచాలని కోరుకొంటున్నారు.



జనదీవెన యాత్రలో భాగంగా బోగోలు మండలం కోవూరుపల్లి గ్రామంలో ప్రజల సమస్యలు అడిగి తెలుసుకొంటున్న వైకాపా కావలి నియోజకవర్గ సమన్వయకర్త రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి.

# స్మగ్లర్లపై ఉక్కుపాదం

**గుంటూరు ఫ్లైయింగ్ స్క్వాడ్ హుస్సేనీ**

ఎర్రచందనం స్మగ్లర్లపై పిడి యాక్టు క్రింద కేసులు నమోదు చేస్తామని గుంటూరు ఫ్లైయింగ్ స్క్వాడ్ డిఎఫ్ఓ హుస్సేని హెచ్చరించారు. ఎర్ర చందనం అక్రమ రవాణాను అడ్డుకొనేందుకు కఠిన చర్యలు చేపడుతున్నామని తెలిపారు. ఇటీవల వెంకటగిరి వచ్చిన ఆయన అధికారులతో సమావేశమయ్యారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ స్మగ్లర్లపై నిఘా పెట్టామని, వారి కదలికలను, ఎత్తుగడలను ఎప్పటికప్పుడు తెలుసుకొంటూ అక్రమ రవాణాను అరికడతామన్నారు. అందుకోసం రెండు బృందాలను ఏర్పాటు చేశామని తెలిపారు. వెంకటగిరి, డక్కిలి, రాపూరు ప్రాంతాలలో ఎర్రచందనం రవాణా అధికంగా జరుగుతున్నందున ప్రత్యేక నిఘా వుంచామన్నారు. స్థానికులు అక్రమరవాణాపై తమకు తెలిసిన సమాచారాన్ని అధికారులకు తెలపాలని, అలాంటి వారి వివరాలు గోప్యంగా వుంచుతామన్నారు. పదిహేను రోజుల్లో 20మంది స్మగ్లర్లపై కేసులు పెట్టామన్నారు. ఈ సమావేశంలో ఫారెస్టు రేంజర్ శ్రీనివాసులు తదితరులు పాల్గొన్నారు.

# కావలి దాహార్తి తీర్చండి!

కావలి పట్టణంలో తాగునీటి ఇబ్బందులు తలెత్తకుండా అన్ని చర్యలు చేపట్టాలని మున్సిపల్ ప్రత్యేకాధికారి, ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి మున్సిపల్ సిబ్బందిని ఆదేశించారు. పట్టణంలో వివిధ ప్రాంతాలలో తాగునీటి ఇబ్బందులు పడుతున్నట్లు ఆయా ప్రాంత ప్రజలు ఫిర్యాదులు చేసిన నేపథ్యంలో ఆర్‌డిఓ పట్టణంలో పర్యటించారు. మున్సిపల్ ప్రజారోగ్య సిబ్బంది కలిసి తాగునీటి సమస్యపై స్థానికులతో మాట్లాడి అప్పటికప్పుడు పరిష్కారానికి సూచనలు

**ఆర్డీఓ విస్తృత పర్యటన**

చేశారు. చంద్రబాబు నగర్, ముసునూరు, ఇందిరమ్మ కాలని ప్రాంతాల ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలపై చర్చించారు. కొళాయిల్లో నీటిని సక్రమంగా సరఫరా చేయాలని, ఎక్కడా తాగునీటికి ఇబ్బందులు లేకుండా చూడాలని సిబ్బందికి సూచించారు. అదే సమయంలో పలు ప్రాంతాలలో నిబంధనలకు విరుద్ధంగా నిర్మించి వున్న అక్రమ కట్టడాలను తొలగించాలని ఆదేశించారు. అలాగే పట్టణ పరిధిలో కొత్తగా వేస్తున్న తాగునీటి పైపులైన్ల పనులను పరిశీలించారు. ఈ పనులను త్వరిత గతిన పూర్తి చేసి ప్రజలకు మంచినీటి ఇబ్బందులు తొలగించాలన్నారు.

# తెలుగు మహిళలు సత్తా చాటాలి!

**● తెలుగుమహిళ జిల్లా అధ్యక్షురాలి పిలుపు**



స్థానిక సంస్థల ఎన్నికల్లో మహిళలు తమ సత్తా చాటి తెలుగుదేశం పార్టీ బలాన్ని చాటి చెప్పాలని తెలుగుమహిళా జిల్లా అధ్యక్షురాలు అంచల వాణి పిలుపునిచ్చారు. తోటపల్లిగూడూరు మండలం సౌత్‌ఆములూరు గ్రామంలో జరిగిన తెలుగుదేశం పార్టీ కార్యకర్తల సమావేశంలో పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డితో కలసి పాల్గొన్నారు. ఈ సందర్భంగా కార్యకర్తలను ఉద్దేశించి మాట్లాడుతూ పెంచిన రిజర్వేషన్లను పరిగణలోనికి తీసుకొంటే ఎన్నికల్లో మహిళల పాత్ర కీలకం కానున్నాదన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని మహిళలు తెలుగుదేశం పార్టీ విజయానికి కృషి చేయాలని పిలుపునిచ్చారు. మహిళలకు ఎన్నికల్లో రిజర్వేషన్లను కల్పించిన ఘనత ఎన్‌టిఆర్ రామారావుదేనని సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి తెలిపారు. 2014లో జరిగే ఎన్నికల్లో తెలుగుదేశంపార్టీని అధికారంలో నిలిపేందుకు ప్రతి కార్యకర్త కష్టించి పని చేయాలని, ఆ దశలో ముందు వచ్చే స్థానిక సంస్థల ఎన్నికల్లో సత్తాచాటాలన్నారు. ఈ సమావేశంలో సోమిరెడ్డి శ్రీనివాసులరెడ్డి చినబాబిరెడ్డి, మద్దిన గోపాలనాయుడు, భార్గవమ్మ తదితరులు పాల్గొన్నారు.

# కావలిలో క్షీణించిన పారిశుద్ధ్యం!

**● అధికారుల నిర్లక్ష్యమే కారణం.**

కావలి పట్టణంలో పారిశుధ్య పరిస్థితి అధ్వాన్నంగా తయారైంది. సరిపడా పారిశుధ్య కార్మికులు వున్నా, చెత్తఎత్తి వేసేందుకు ఆటోలు, ట్రాక్టర్లు, ట్రక్కులు వున్నా అధికారులు, సిబ్బంది నిర్లక్ష్యం కారణంగా ఎక్కడికక్కడ చెత్త పేరుకపోయి ముదనష్టంగా వుంది. ప్రస్తుతం వున్న 35 వార్డుల్లో ఏ వార్డును పరిశీలించినా క్షీణించిన పారిశుధ్యం, అపరిశుభ్ర వాతావరణం కన్పిస్తోంది. ప్రధానంగా మార్కెట్ సెంటర్, ట్రంకురోడ్డు, ప్రభుత్వ ఆస్పత్రి పరిసర ప్రాంతాలను పరిశీలిస్తే మునిసిపాలిటీ పనితీరు ఎంత ఘోరంగా వుందో తేటతెల్లం అవుతుంది. మరోవైపు చెత్తను తరలించే వాహనాలు అధికభాగం పుచ్చిపోయి అడుగుభాగం దెబ్బతినిపోయి వున్నాయి. వీటిలో చెత్తను వేసిన అదంతా రోడ్డుపైనే పడిపోతుంది. తప్ప దూరప్రాంతాలకు చెత్తను తరలించేందుకు ఏ మాత్రం అనువుగా లేదు. ఎప్పుడైనా విఐపిలు, అధికారులు తనిఖీలకు వస్తున్నారంటే గబగబా ఆ ప్రాంతాలను మాత్రం శుభ్రపరచి అంతా బాగుందనిపిస్తున్నారు తప్ప సక్రమంగా చెత్తను శుభ్రపరుస్తున్న దాఖలాలు లేవని స్థానికులు వాపోతున్నారు.

**● పట్టణాల్లోని వారి కోసం**

# నెహ్రూ స్వగృహ పథకం!



పట్టణాల్లో స్వయం సహాయక సంఘాల్లోని పొదుపు గ్రూపు మహిళలకు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ స్వగృహ పథకం ద్వారా పక్కాగృహాలు మంజూరు చేస్తామని తిరుపతి పార్లమెంటుసభ్యుడు డాక్టర్ చింతామోహన్ తెలిపారు. ఇటీవల వెంకటగిరికి వచ్చిన ఆయన స్థానిక మున్సిపల్ కార్యాలయంలో పొదుపు మహిళలతో సమావేశమయ్యారు. ఇందిరమ్మ గృహాలకు ప్రస్తుతం ప్రభుత్వం అందిస్తున్న మొత్తం చాలడంలేదని దీనిని దృష్టిలో వుంచుకొని బ్యాంకు రుణాన్ని, ప్రభుత్వం అందించే మొత్తాన్ని కలిపి జవహర్‌లాల్ స్వగృహ పథకాన్ని అమలు చేస్తున్నట్లు ప్రకటించారు. దీనికి సంబంధించి పథకం అమలు, తదితర విషయాలపై కలెక్టర్ శ్రీధర్‌తో మాట్లాడామన్నారు. అందరికి సొంతిల్లు వుండాలన్న లక్ష్యంతో ఈ పథకాన్ని ప్రవేశపెట్టినట్లు తెలిపారు. గ్రామాల్లో ఉపాధిహామీ పథకం అమలవుతున్నందున ఆర్థికంగా ప్రజలకు బాగున్నారని, అదే పట్టణాల్లో ఆ అవకాశం లేనందున ఆర్థికంగా వెనుకబడి వున్నట్లు గుర్తించానన్నారు. యూపిఏ చైర్‌పర్సన్ సోనియాగాంధీ ఆహార భద్రత చట్టాన్ని తీసుకొస్తున్నారని దీనిప్రకారం 100 రూపాయలకే 35 కిలోల బియ్యాన్ని ఇవ్వనున్నట్లు ప్రకటించారు. అనంతరం స్వయంగా చింతామోహన్ స్వగృహ పథకానికి సంబందించిన దరఖాస్తులను లబ్దిదారులకు అందించారు. ఈ సమావేశంలో మెప్మా పిడి కమలకుమారి, మున్సిపల్ కమిషనర్ ప్రమీల, తహశీల్దార్ కృష్ణమూర్తి, రంగనాథం తదితరులు పాల్గొన్నారు.

# మహిళాభ్యున్నతికి వైఎస్ కృషి చేశారు!



**సూళ్లూరుపేటలో నెలవల**

రాష్ట్రంలో మహిళల అభ్యున్నతికి, వారి సాధికారతకు దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఎంతో కృషి చేశారని మాజీ ఎమ్మెల్యే, సూళ్లూరుపేట నియోజకవర్గ వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ సమన్వయకర్త నెలవల సుబ్రహ్మణ్యం కొనియాడారు. పెళ్లకూరు మండలంలో గడపగడపకు వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ కార్యక్రమాన్ని చేపట్టారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ కాంగ్రెస్ ప్రభుత్వం రాష్ట్రాన్ని అన్ని విధాల భ్రష్టుపట్టించిదని విమర్శించారు. అన్ని వస్తువుల ధరలు పెరిగి ఒకవైపు, కరెంటు ఛార్జీల భారం మోపడం వలన మరోవైపు ప్రజలు అతలాకుతలం అవుతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. రైతుల పరిస్థితి అగమ్య గోచరంగా వుందన్నారు. ప్రజలు ఇంతగా బాధలు పడుతున్నా ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి, ఇతర మంత్రులకు ఇవేమీ పట్టడం లేదన్నారు. ఎస్సీ, ఎస్టీలకు సబ్‌ప్లాన్ అమలుతో అభ్యున్నతికి పాటు పడుతున్నామని కాంగ్రెస్‌పార్టీ గొప్పలు చెప్పుకొంటున్నా నిజంగా వీరి సంక్షేమానికి డాక్టర్ వైఎస్ రాజశేఖర్ రెడ్డి ఎనలేని కృషి చేశారన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొన్ని ప్రజలు వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని ముఖ్యమంత్రిని చేసేందుకు కంకణ బద్ధులు కావాలని పిలుపునిచ్చారు. ఈ కార్యక్రమంలో వైపాకా నేతలు దబ్బల రాజారెడ్డి, చైతన్య కృష్ణారెడ్డి, మధుసూధనరెడ్డి, వెంకటకృష్ణా రెడ్డి, ఆనంద రెడ్డి, హరిరెడ్డి, మాజీ సర్పంచ్ తిరుపాలయ్య, కృష్ణయ్య, వెంకటయ్య తదితరులు పాల్గొన్నారు.

# కొమ్మిపై పాపకన్ను ఆగ్రహం!

## ఏకపక్షంగా వ్యవహరిస్తున్నాడని ఆరోపణ

వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ వెంకటగిరి నియోజకవర్గ సమన్వయకర్త కొమ్మి లక్ష్మయ్యనాయుడుపై ఆ పార్టీ స్టీరింగ్ కమిటీసభ్యుడు పాపకన్ను రాజశేఖర్‌రెడ్డి చిటపటలాడారు. ఏకపక్షంగా వ్యవహరిస్తూ వర్గ విబేధాలను ఎగదోస్తున్నాడంటూ ఆరోపణలు చేశారు. కలువాయికి చెందిన వైద్యుడు మాజీ మండలాధ్యక్షుడు స్వర్గీయ గోపాలరెడ్డి వర్ధంతి కార్యక్రమంలో పాల్గొనేందుకు వచ్చిన ఆయన కొమ్మి వ్యవహారశైలిపై విరుచుకపడ్డారు. మండలంలో గత కొంతకాలంగా జరుగుతున్న రాజకీయ పరిణామాలపై స్పందిస్తూ నిన్నకాక మొన్న పార్టీలోకి వచ్చిన వ్యక్తులు పెత్తనం చెలాయిస్తున్నారంటూ కొమ్మి వర్గీయులపై పరోక్ష విమర్శలు చేశారు. పనిలో పనిగా కొమ్మి లక్ష్మయ్యనాయుడు పని తీరుపై విమర్శలు చేశారు. నియోజకవర్గ సమన్వయకర్త అంటే పార్టీని బలోపేతం చేయడంతోపాటు అందరిని కలుపుక పోవాలన్నారు. కానీ కొమ్మి అందుకు విరుద్ధంగా వ్యవహరిస్తూ వర్గ విబేధాలను రెచ్చగొడుతున్నాడన్నారు. ఆయన వ్యవహారశైలి పార్టీకి నష్టం కల్గించే విధంగా వుందన్నారు. కొమ్మిపై చిర్రుబుర్రులాడిన పాపకన్ను చివరకు వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఎవరికి బి-ఫారం ఇచ్చినా వారి విజయానికి కృషి చేస్తామని ముక్తాయింపు ఇవ్వడంతో కార్యకర్తలు బుర్రగోక్కున్నారు.

# కానిస్టేబుళ్ల పిల్లలు ఐపిఎస్‌లు కావాలి!

## వెంకటగిరి పోలీస్ కమాండెంట్ పిలుపు

పోలీస్ కుటుంబాల పిల్లలు వున్నత విద్య అభ్యసించి మంచి ఉద్యోగాలలో స్థిరపడాలని వెంకటగిరి తొమ్మిదవ బెటాలియన్ కమాండెంట్ ఎం.నాగూర్‌రెడ్డి అభిలాషించారు. పోలీసు కుటుంబాలకు చెందిన పిల్లలు పదవతరగతి, ఇంటర్మీడియట్, డిగ్రీ పరీక్షల్లో మంచి ఫలితాలు సాధించిన విద్యార్థిని విద్యార్థులకు పోలీస్‌శాఖ తరపున మెరిట్ స్కాలర్ షిపులను పంపిణీ చేసే కార్యక్రమంలో ఆయన పాల్గొని వాటిని అందజేశారు. ఈ సందర్భంగా పిల్లలను ఉద్దేశించి ఆయన మాట్లాడుతూ కానిస్టేబుల్ పిల్లలు కానిస్టేబుళ్లే కాకుండా ఐపిఎస్‌లుగా, ఐఎఎస్‌లుగా ఇతర రంగాల్లో ఉన్నతులుగా ఎదగాలని, ఆ దిశగా విద్యార్థులు కష్టపడి చదువుకోవాలని హితబోధ చేశారు. తల్లిదండ్రులు విద్యార్థుల ఇష్టాఇష్టాలను తెలుసుకొని వారిని ప్రోత్సహించాలన్నారు. బెటాలియన్ స్కూలు పిల్లలతోపాటు బయట ప్రాంతాల పిల్లలకు సాంకేతికపరమైన విద్యతోపాటు ఉచితంగా భోజనం, వాహన సౌకర్యం కల్పిస్తున్నామన్నారు. ఈ అవకాశాన్ని విద్యార్థులు సద్వినియోగం చేసుకోవాలన్నారు.

# యూపిఏ ప్రభుత్వం వైఫల్యం చెందింది!

## ఆత్మకూరులో సన్నపురెడ్డి సురేష్‌రెడ్డి



కేంద్రంలోని యూపిఏ ప్రభుత్వం అన్ని రంగాల్లో ఘోరంగా విఫలమైందని బిజెపి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి సన్నపురెడ్డి సురేష్‌రెడ్డి విమర్శించారు. పొరుగు దేశమైన చైనా మన భూభాగంలోకి 10 కిలో మీటర్లు చొచ్చుకొని వచ్చినా వారిని ఎదుర్కొవడంలో కేంద్రప్రభుత్వం ఎలాంటి చర్యలు చేపట్టకపోవడం సిగ్గుచేటన్నారు. అన్ని రంగాల్లో విఫలమైన యూపిఏ ప్రభుత్వాన్ని సాగనంపి, ఎన్‌డిఏకు అధికారం కట్టబెట్టేందుకు ప్రజలు ఎదురు చూస్తున్నారన్నారు. ఇటీవల ఆత్మకూరులోని ఇరిగేషన్ బంగ్లాలో జరిగిన బిజెపి కార్యకర్తల సమావేశంలో పాల్గొని ప్రసంగించారు. యువనేత నరేంద్రమోడి నాయకత్వంలో దేశం మరింతగా అభివృద్ధి చెందుతుందన్న ఆశ ప్రజల్లో వ్యక్తమవుతున్నాదన్నారు. ప్రతి కార్యకర్త పార్టీని ప్రజల్లోకి తీసుకెళ్లాలని పిలుపునిచ్చారు. అవినీతిమయమైన యూపిఏ ప్రభుత్వాన్ని వచ్చే ఎన్నికల్లో గద్దెదింపాలని రాష్ట్ర కార్యదర్శి కాకుమాని విజయలక్ష్మి సూచించారు. త్వరలో జరగనున్న స్థానిక సంస్థల ఎన్నికల్లో బిజెపి విజయానికి అందరు కృషి చేయాలని జిల్లా అధ్యక్షుడు సురేంద్రరెడ్డి పిలుపు నిచ్చారు. ఈ సమావేశంలో సుధాకర్‌రెడ్డి, సురేష్, రమణప్పనాయుడు, రమణారెడ్డి, జనార్ధన్‌రెడ్డి, హజరత్తయ్య, కృష్ణయ్య, జయరాజ్ తదితరులు పాల్గొన్నారు.





నెల్లూరు నర్తకి సెంటర్‌లో బాలకృష్ణ జన్మదినోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసిన సభలో మాట్లాడుతున్న తెలుగుదేశం పార్టీ రాష్ట్ర నాయకుడు గోరంట్ల బుచ్చయ్య చౌదరి.




డిగ్రీ పరీక్షా ఫలితాల్లో ఉత్తమ మార్కులు సాధించిన నెల్లూరు చంద్రారెడ్డి డిగ్రీ కళాశాల విద్యార్థులను అభినందిస్తున్న విక్రమ సింహపురి యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ రాజారామిరెడ్డి, రిజిస్ట్రార్ నాగేంద్ర ప్రసాద్‌లతో కాలేజి కరస్పాండెంట్ కోటంరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి.



# సౌభాగ్యాన్ని ప్రసాదించే వటసావిత్రి వ్రతం!

హిందూ సంస్కృతి సాంప్రదాయాలలో ప్రతి పూజకు, వ్రతానికి ఒక విశిష్టత వుంది. మహిళల సౌభాగ్యాన్ని కాంక్షిస్తూ చేసే వ్రతాలు కొన్ని కాగా, కుటుంబ సుఖ శాంతులను, సంక్షేమాన్ని కోరుకొంటూ చేసే వ్రతాలు మరికొన్ని. ఇలాంటి వాటిలో సౌభాగ్యాన్ని కోరుకొంటూ మహిళలు ఆచరించే వ్రతమే వటసావిత్రి వ్రతం. స్త్రీలకు ఐదోతనాన్ని, ఆరోగ్యాన్ని, ఆనందాన్ని, సకల సౌభాగ్యాలను ప్రసాదించడంతో పాటు, వైధవ్యం నుంచి కాపాడే వ్రతంగా ఈ వటసావిత్రి వ్రతానికి పేరుంది. ఈ వ్రతాన్ని జ్యేష్ట శుద్ధ పౌర్ణమినాడు ఆచరిస్తారు.

వటవృక్షం అనగా మర్రిచెట్టు. భారతీయుల జాతి వృక్షం ఇది. మర్రిచెట్టును త్రిమూర్తుల స్వరూపంగా భావిస్తారు. మర్రిచెట్టు వేళ్లు బ్రహ్మకు, కాండం విష్ణువుకు, కొమ్మలు శివునికి నివాస స్థలాలు. అలాంటి త్రిమూర్తి స్వరూపమైన మర్రిచెట్టును పూజించే వ్రతం కాబట్టి దీనికి వటసావిత్రి వ్రతం అనే పేరొచ్చిందని చెప్తారు. ఈ వ్రతం ఆచరించే సుమంగళులు ముందుగా వటవృక్షాన్ని పసుపు, కుంకుమలతో పూజించి అక్షింతలు చల్లి వేడుకొంటారు. పువ్వులు, గాజులను చెట్టుకు అలంకరించి ధూప దీప నైవేద్యాలతో పూజిస్తారు. అనంతరం మర్రిచెట్టు చుట్టూ 108 ప్రదక్షిణలు చేస్తూ ప్రత్తి నుండి వడికి తీసిన దారాన్ని వృక్షం చుట్టూ చుడతారు. వటవృక్షం దీర్ఘాయుర్దాయం లాగానే తమ తమ భర్తలు దీర్ఘాయుష్షుతో వుండాలని, సౌభాగ్యం బలంగా వుండాలని కాంక్షిస్తూ ఈ దారం చుడతారు. పూజపూర్తయ్యాక ప్రతి స్త్రీ ఐదుగురు సుమంగళులకు బొట్టు పెట్టి తాంబూలం సమర్పించాలి.

వటసావిత్రి వ్రతానికి సంబంధించిన గాధ ఒకటి వుంది. మద్రదేశ మహారాజు అశ్వపతి కుమార్తె సావిత్రి. సాళ్వదేశ పాలకుడైన ద్యుమత్సేనుని కుమారుడైన సత్యవంతుని వరిస్తుంది. సత్యవంతుడు ఏడాది ఆయుర్దాయం కల్గినవాడు మాత్రమే నని నారదుడు తెలిపినా సావిత్రి అతడినే పరిణయమాడుతుంది. సత్యవంతుడు మరో మూడు రోజుల్లో మరణిస్తాడనగా సావిత్రి త్రిరాత్రి వ్రతం చేస్తుంది. తన భర్త ప్రాణాలు తీసుకొన్న యముడిని దర్శింపడంతోపాటు ఆయన్ను ప్రసన్నం చేసుకొని వరాలు పొందగలిగింది. భర్త పునరుజ్జీవతుడయ్యేలా వరం సాధించింది. భర్త ప్రాణాల కోసం ఒక వటవృక్షం క్రింద సావిత్రి యముడిని ఎదుర్కొన్నందున ఆనాటి నుంచి సుమంగళులు వట సావిత్రి వ్రతాన్ని ఆచరిస్తున్నారని పురాణాలు తెలుపుతున్నాయి. అటు పుట్టినింటిని, ఇటు మెట్టినింటిని ఆదుకొన్న వ్యక్తిగా, ధృడమైన నిర్ణయం, పట్టుదల, భర్తపట్ల అమితమైన ప్రేమానురాగాలు కల్గిన భార్యగా, లోకకళ్యాణాన్ని కాంక్షించే సాధ్విగా సావిత్రి పేరు గడించింది. స్త్రీ శక్తికి ప్రతీకైన సావిత్రి పేరున ప్రతి ఏటా జ్యేష్ట శుద్ధపూర్ణమి నాడు వటసావిత్రి వ్రతం ఆచరిస్తారు.

అన్యాయం

# నిర్దోషిని దోషిగా ఇరికించే ప్రయత్నం చేసిన అల్లూరు ఎస్ఐ!

**అల్లూరు మజరా ఎర్రపుగుంట సమీపంలో జరిగిన రోడ్డు ప్రమాదంలో ఓ వ్యక్తి దుర్మరణం పాలయ్యాడు. ఈ కేసును తూతూ మంత్రంగా విచారించిన ఎస్ఐ ఓ ట్రాక్టర్ యజమానిపై అక్రమ కేసు నమోదు చేశాడు. అంతిమంగా ఈ ప్రమాదం చేసిన వ్యక్తి స్టేషన్‌కు వచ్చి నేరాన్ని ఒప్పుకోవడంతో పోలీసుల కేసు దర్యాప్తుల విషయంలోని డొల్లతనం బయటపడింది.**

వంద మంది దోషులు తప్పించుకున్నా, ఒక నిర్దోషిని శిక్షించరాదని చట్టం, న్యాయం చెబుతున్నా అందుకు భిన్నంగా వ్యవహరిస్తున్నారు మన జిల్లా పోలీసులు. నేరం జరిగినప్పుడు సంఘటనా ప్రాంతానికి వెళ్లి అన్ని కోణాల్లో దర్యాప్తు చేయాలి. నేరం జరిగిన సమయంలో సమీపంలో వుండి చూసిన వారిని గుర్తించి వారి నుంచి సమాచారం రాబట్టాల్సి వుంటుంది. చాలా కేసుల్లో పోలీసులు సక్రమంగా దర్యాప్తు చేయలేకపోతున్నారు. స్థానిక రాజకీయాల ప్రభావం కారణంగా ఎవరో ఒకరి మీద కేసు నమోదు చేసి చేతులు దులుపుకొంటున్న సంఘటనలు లేకపోలేదు. ఇటీవల అల్లూరు పోలీస్‌స్టేషన్ పరిధిలోని ఎర్రపుగుంట సమీపంలో రోడ్డు ప్రమాదం జరిగింది. ఈ ప్రమాదంలో ఒక వ్యక్తి దుర్మరణం చెందాడు. అయితే ప్రమాదం జరిగినప్పుడు ఎవరు కూడా ప్రత్యక్షంగా చూసిన దాఖలాల్లేవు. సమాచారం అందుకున్న పోలీసులు ప్రమాదంపై పెద్దగా స్పందించలేదు. సమీప పొలాల్లో మట్టిని తరలిస్తున్న కొన్ని ట్రాక్టర్ల వద్దకు వెళ్లి కొన్నింటిని స్టేషన్‌కు తరలించారు.

ట్రాక్టర్ల యజమానులు తాము ఎటువంటి ప్రమాదాలు చేయలేదని విన్నవించుకున్నా స్థానిక ఎస్ఐ ఏమాత్రం పట్టించుకోలేదు. ఇక లాభం లేదనుకున్న ట్రాక్టర్ల యజమానులు రాజకీయ నేతలను ఆశ్రయించి తమ వాహనాలను విడిపించుకు వెళ్లారు. ఏదో ఒక ట్రాక్టర్‌పై కేసు నమోదుచేసి కోర్టుకు హాజరు పరచాలన్న ఆతృతతో రెండు ట్రాక్టర్లను స్టేషన్‌కు రప్పించారు. ఈ రెండింటిలో ఒక దాని యజమాని అధికార పార్టీ నేతలకు సన్నిహితుడు కావడంతో మరుసటిరోజు ట్రాక్టర్‌ను విడిచి పెట్టాల్సి వచ్చింది. స్టేషన్‌లో వుంచుకున్న మరో ట్రాక్టర్ ప్రమాదానికి కారణమని మరణించిన వ్యక్తి బంధువుల చేత చెప్పించారు. అమాయకులైన మృతుని బంధువులు పోలీసులు చెప్పినట్టుగానే ఫిర్యాదు చేశారు. ఈ ప్రమాద సంఘటనపై మరింత లోతుగా దర్యాప్తు చేయకుండానే ముగించాలని భావించిన ఎస్ఐకు చివరి క్షణంలో చుక్కెదురైంది. ట్రాక్టర్ యజమాని ఎస్ఐ వ్యవహారశైలిపై రూరల్ డిఎస్పీని కలిసి పూర్తి వివరాలు అందజేశాడు. కేసును పూర్తిగా విచారించాలని కోవూరు సిఐని ఆదేశించడంతో మళ్లీ కథ మొదటికొచ్చింది.

కానీ కోవూరు సిఐ మాత్రం ప్రమాదం జరిగిన ప్రాంతాన్ని పరిశీలించకుండానే ఎస్ఐకు ఆదేశాలిస్తూ వచ్చాడు. పోలీస్ స్టేషన్‌లో నిర్బంధంలో వున్న ట్రాక్టర్‌ను ఎలాగైనా విడిపించుకోవాలన్న తపనతో దాని యజమాని వ్యక్తి మరణానికి కారణమైన ట్రాక్టర్ గురించి ఆరా తీశాడు. దాదాపు 15 రోజుల తర్వాత ట్రాక్టర్ ఆచూకీ లభించింది. మృతుని బంధువుల్ని స్టేషన్‌కు పిలిపించి ముందుగా ఇచ్చిన ఫిర్యాదులో పేర్కొన్న ట్రాక్టర్ యజమానికి బదులుగా మరో ట్రాక్టర్ యజమాని పేరును చేర్పించారు. ఎట్టకేలకు తొలుత స్టేషన్‌లో నిర్బంధించిన ట్రాక్టర్‌ను విడిపించారు. వాస్తవాలు తెలుసుకోకుండానే సంబంధంలేని ట్రాక్టర్‌ను 15 రోజులకుపైగా స్టేషన్‌లో వుంచడంతో దీని యజమాని ఆర్థికంగా నష్టపోవాల్సి వచ్చింది. అంతేకాకుండా పోలీస్‌స్టేషన్, ఉన్నతాధికారుల చుట్టూ తిరగాల్సి రావడంతో మరిన్ని ఖర్చులు భరించాల్సి రావడం విశేషం.

అల్లూరు ఎస్ఐ, కోవూరు సిఐల నిర్లక్ష్యం కారణంగా నేరంతో ఎటువంటి సంబంధంలేని వ్యక్తిని కేసులో ఇరికించే వరకు వెళ్లింది. వ్యక్తి మరణానికి కారణమైన ట్రాక్టర్ ఆచూకీ లభించకుంటే వేరొకరు జైలుకు వెళ్లాల్సి వుండేది. జిల్లా ఎస్పీ, డిఎస్పీలు తమకు అందిన ఫిర్యాదులపై వెంటనే స్పందించి బాధితులకు న్యాయం చేయాలని సిఐ, ఎస్ఐలను ఆదేశిస్తుంటారు. అయితే సిఐ, ఎస్ఐలు మాత్రం రాజకీయ జోక్యానికి తలొగ్గి పైస్థాయి అధికారుల ఆదేశాలను ఖాతరు చేయకుండా అవాస్తవాలను చెబుతుండడంతో బాధితులు తీవ్రంగా నష్టపోతున్నారు. పోలీసులు విధి నిర్వహణలో ఎలా వ్యవహరిస్తున్నారో పై సంఘటన ఉదాహరణగా భావించవచ్చు. జిల్లా పోలీసు కార్యాలయంలో ప్రతి సోమవారం జిల్లా ఎస్పీ నిర్వహించే ప్రజావిజ్ఞప్తులు దినంలో వివిధ సమస్యలపై అర్జీలు స్వీకరించి సంబంధిత డిఎస్పీలకు ఎస్పీ ఆదేశాలు జారీచేస్తారు.

బాధితుల నుంచి స్వీకరించిన ఫిర్యాదులు స్టేషన్‌కు పంపుతుంటారు. క్షేత్రస్థాయిలో మాత్రం సమస్య గురించి పట్టించుకోకపోవడంతోపాటు బాధితుల పట్ల అవమానకరంగా ప్రవర్తిస్తున్నారన్న ఆరోపణలు వున్నాయి. ఇప్పటికే కొందరు పోలీసుల తీరు కారణంగా పోలీస్ శాఖ పరువు బజారున పడుతోంది. జిల్లా ఎస్పీ స్పందించి విధి నిర్వహణలో నిర్లక్ష్యంగా వుండే సిఐ, ఎస్ఐల పట్ల కఠినంగా వ్యవహరించాల్సిన అవసరం వుంది. లేకుంటే ప్రజల్లో పోలీస్ శాఖపై నమ్మకం సన్నగిల్లుతోంది.



## విజయమ్మ సమక్షంలో కొమ్మి వీరావేశం!

రాతు మెత్తనైతే గుర్రం మూడు కాళ్ల మీద అడ్డదిడ్డంగా పరుగెడుతుందన్న సామెత వైఎస్ జగన్ పార్టీ విషయంలో నిజమౌతున్నది. జగన్ జైలుకు పోవడంతో ఆ పార్టీకి కళ్లెం వేసే వాడు లేకుండా పోయాడు. ఎంతగా జైలు నుంచి నియంత్రిస్తున్నా, స్వంత కుటుంబ సభ్యులు వెయ్యి కళ్లతో కాపాడుతున్నా జగన్ లేని లోటు మాత్రం అనుక్షణం కనిపిస్తూనే వుంది. అందుకొక తాజా ఉదాహరణ – నెల్లూరుజిల్లా నేత కొమ్మిలక్ష్మయ్య నాయుడి వీరావేశం.

రెండు వారాల క్రితం జిల్లా వారీ సమన్వయకర్తల సమావేశం జరిపారు వైఎస్ విజయమ్మ. పార్టీ వ్యవహారాలను సమీక్షించి, పంచాయితీ ఎన్నికలకు అందరినీ పురమాయించచడం ఈ సమావేశం ఉద్దేశ్యం. వెంకటగిరి నియోజకవర్గ సమన్వయకర్త కొమ్మి లక్ష్మయ్య నాయుడు కూడా ఈ సమావేశానికి హాజరైనారు. జిల్లా పార్టీ అధ్యక్షుడు మేరిగ మురళీ కూడా వచ్చాడు. వీరిద్దరి మధ్య మాటల యుద్ధం మొదలైంది. దానికి మూలం – మేరిగ మురళీకి ఆయన స్వగ్రామంలో జరిగిన సన్మానం. ఆ ఊరు వెంకటగిరి నియోజకవర్గ పరిధిలో వుంది. సన్మానం చేసింది – పాపకన్ను సోదరుల అనుచరులు. వారికి కొమ్మికి సరిపడదు. అందువల్ల ఆ సమావేశానికి పిలవలేదు. ఆ అంశాన్ని ఈ సమావేశంలో లేవనెత్తాడు కొమ్మి. ఆయనకు కోపం వస్తే మాటలెంత పరుషంగా వుంటాయో అందరికీ

కొరవ 14వ పేజీలో

# తమిళనాడు తరలిపోతున్న ఆంధ్రా రేషన్ బియ్యం!

**రాష్ట్ర ప్రభుత్వం ఎంతో గొప్పగా చెప్పుకొంటున్న రూపాయికి కిలో బియ్యం పథకం తాలూకు బియ్యం బస్తాలు ప్రతి నెలా ఒక పథకం ప్రకారం తమిళనాడుకు తరలిపోతున్నాయి. ఈ నెలలో 40 లక్షలు రూపాయలకు పైగా విలువ చేసే ఈ బియ్యాన్ని నాయుడుపేట, వెంకటాచలం, చెముడుగుంట రైసు మిల్లుల్లో దాచి వుంచగా విజిలెన్స్ అధికారులు పట్టుకొన్నారు.**

అధికారుల ఉదాసీనత, రేషన్‌షాపు డీలర్ల చేతివాటం కారణంగా ప్రజలకు చెందాల్సిన సబ్సిడీ బియ్యం జిల్లా సరిహద్దు దాటి తమిళనాడు రాష్ట్రానికి తరలిపోతున్నాయి. ప్రతినెల రేషన్ షాపులకు సరఫరా అవుతున్న కిలో రూపాయి బియ్యాన్ని డీలర్లు బయట మార్కెట్‌కు తరలిస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా ప్రవేశపెట్టి అమలు చేస్తున్నా ఈ పథకానికి అధికారుల నిర్లక్ష్యం కారణంగానే తూట్లు పడుతున్నాయి. రేషన్‌షాపులకు సరఫరా చేస్తున్న బియ్యంను కొందరు లబ్ధిదారులు సరైన సమయానికి తీసుకెళ్లలేకపోతున్నారు. ప్రతినెల 15వ తేదిలోగా సరకులను తీసుకెళ్లకుంటే ఆ తర్వాత సరుకులు అయిపోయాయని బోర్డు తగిలిస్తుంటారు. లబ్ధిదారులు తీసుకెళ్లని సరుకులను వ్యాపారులకు విక్రయిస్తుంటారు. జిల్లాలోని అన్ని రేషన్‌షాపుల నుంచి కొనుగోలు చేసిన బియ్యాన్ని ఒక ప్రాంతానికి చేర్చి అనంతరం అక్కడ నుంచి తమిళనాడుకు చేరవేస్తున్నారు.

ఈ వ్యాపారం అనేక సంవత్సరాల నుంచి కొనసాగుతోంది. అనేక సందర్భాల్లో లారీల ద్వారా తరలిపోతున్న సబ్సిడీ బియ్యం పట్టుబడినప్పటికి వీటిని సరఫరా చేసిన అసలు సూత్రధారుల ఆచూకీ కనుగొనలేకపోయారు. రాజకీయ ఒత్తిళ్ల నేపథ్యంలో అధికారులు బియ్యం విక్రయిస్తున్నా వారిపట్ల కఠినంగా వ్యవహరించలేకపోయారన్న ఆరోపణలు వున్నాయి. కేవలం బియ్యం తరలిస్తున్న లారీలను పట్టుకోవడం, డ్రైవర్లపై కేసులు నమోదు చేయడం తప్ప కేసుల్లో పురోగతి సాధించడం లేదు. పౌరసరఫరాలశాఖ, రెవెన్యూ, విజలెన్స్ విభాగాలు సమన్వయం చేసుకొని రేషన్‌బియ్యం పంపిణీపై తనిఖీలు చేస్తే అక్రమాలు నిరోధించవచ్చు. అలా కాకుంటే ఎవరికి వారు తమ ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నందున వ్యాపారులకు బాగా కలిసిరావడంతోపాటు అనతి కాలంలో కోటేశ్వరులైపోతున్నారు. తమిళనాడు రాష్ట్రంలో మన సబ్సిడీ బియ్యానికి మంచి డిమాండ్ వుంటుంది. ఇక్కడ రూపాయి బియ్యాన్ని 10 రూపాయలకు కొనుగోలు చేసి ఆ తర్వాత రీసైక్లింగ్ చేసి చెన్నైలో 30 రూపాయలకు విక్రయిస్తున్నట్లు సమాచారం.

### *40లక్షల బియ్యం పట్టివేత*

ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా లబ్ధిదారులకు చేరాల్సిన దాదాపు 40లక్షలకు పైగా విలువ చేసే బియ్యాన్ని అధికారులు పట్టుకున్నారు. ఈనెలలోనే నాయుడుపేట, వెంకటాచలం మండలం చెముడుగుంట లోని రైస్‌మిల్లుల్లో దాచి వుంచిన బియ్యాన్ని పోలీసుల సహకారంతో విజిలెన్స్ విభాగం అధికారులు స్వాధీనం చేసుకోవడం జరిగింది. కాని రైస్‌మిల్లులకు చేరిన రేషన్ బియ్యం ఏ ప్రాంతం నుంచి తీసుకొచ్చారన్న విషయాన్ని తేల్చలేక పోతున్నారు. జిల్లా జాయింట్ కలెక్టర్ పర్యవేక్షణలో పౌరసరఫరాలశాఖాధికారులు రేషన్‌షాపులకు స్టాక్ పాయింట్ల నుంచి బియ్యం సరఫరా చేస్తుంటారు. కొన్ని ప్రాంతాల్లోని స్టాక్ పాయింట్లు నుండి బియ్యంతో బయలు దేరిన వాహనాలు నేరుగా రైసు మిల్లులకు వెళుతున్నాయన్న ఆరోపణలు వున్నాయి. రేషన్‌షాపు డీలర్ల సూచన మేరకు రాత్రిపూట బియ్యం సరఫరా చేస్తుంటారు. పొద్దుపోయాక ఎవరు చూడకుండా బియ్యం తరలిస్తుంటారు.

మండల తహశీల్దార్ కార్యాలయంలో రేషన్‌షాపులను పర్యవేక్షించి సిబ్బందికి ప్రతినెల కమీషన్లు ఇస్తుంటారు డీలర్లు. ఇంతే కాకుండా ఆయా గ్రామాల్లో ఏదైనా కార్యక్రమం ఏర్పాటుకు డీలర్లు అన్ని సమకూరుస్తుంటారు. దీంతో రెవెన్యూ అధికారులు డీలర్ల పట్ల కొంత ఉదాసీనతగా వ్యవహరిస్తూ చూసీచూడనట్లుగా పోతున్నారు. జిల్లాస్థాయిలో నిర్వహించే సమీక్షా సమావేశంలో రేషన్‌షాపులను నిత్యం తనిఖీ చేయాలని జాయింట్ కలెక్టర్ ఆదేశిస్తున్నా ఆయన ఆదేశాలు ఏ అధికారి కూడా పాటించిన దాఖలాలు కనిపించడం లేదు. కావలి నుంచి తడ వరకు ఏదో ఒక ప్రాంతంలో వారానికోసారి రేషన్‌బియ్యం పట్టుబడుతున్నాయి. అసలు సూత్రధారులపై క్రిమినల్ కేసులు నమోదు కాకపోవడంతో మరికొన్ని అక్రమాలకు పాల్పడుతున్నారు. జిల్లా అధికారయంత్రాంగం ఇటువంటి వారిపట్ల కఠినంగా వ్యవహరించకపోతే భవిష్యత్‌లో రేషన్‌బియ్యం లబ్ధిదారులకు పూర్తిగా దక్కకుండాపోయే అవకాశం వుంది.

# వారఫలాలు

తేది 15-6-2013 నుండి 21-6-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో కుజుడు; మిధునంలో రవి, బుధ, గురులు, శుక్రుడు 23తేది నుంచి కర్కాటకంలో; తులలో శని, రాహువులు; వృశ్చిక, ధనుర్మకర, కుంభాలలో చంద్రుడు సంచరిస్తారు.




చేపట్టిన పనులకై గట్టి కృషి చేస్తారు. కొన్ని విషయాలలో కఠిన నిర్ణయాలు తీసుకొంటారు. స్పెక్యులేషన్ లాభిస్తుంది. వృత్తి, వ్యాపారాలలో శ్రమకు తగ్గ ఫలితం వుంటుంది. స్త్రీలు నూతన వస్తు, వస్త్రాభరణాలు కొంటారు. వ్యాపార భాగస్వామ్యాలు నిలకడగా వుంటాయి. విద్యార్థులకు నూతన పరిచయాలేర్పడతాయి. అధిక శ్రమ అవసరం. ఇంట్లో శుభకార్యాల మూలంగా ధన వ్యయం.




తలపెట్టిన పనులు సకాలంలో పూర్తి చేయడానికి కొత్త నిర్ణయాలు తీసుకొంటారు. వాస్తవాంశాలు గోప్యంగా వుంచండి. గర్వభంగం కాగల సూచనలున్నాయి. మనోవాంఛలు కాస్త ఆలస్యంగా తీరుతాయి. ఇతరులతో మాట్లాడేటప్పుడు వాదప్రతివాదనలు, తొందరపాటుతనం, అధిక ప్రసంగం వల్ల విరోధాలు ఏర్పడగలవు. వృత్తి, వ్యాపారాలు ఆర్థికంగా, ఆశాజనకంగా వుంటాయి.




అనవసర పంతాలు, ఆర్భాటాలకు వెళ్లకండి. సజ్జన సహకారం, సహచర్యం అవసరమౌతాయి. పట్టుదలకెళ్లి భంగపడగలరు. ఆలోచనా శక్తిమేరకు ఆలోచనలు సాగకుండడం, కొన్ని వ్యవహారాలు మొండిగా వుండడం బాధిస్తాయి. ప్రతి పనికి గట్టి ప్రయత్నం అవసరం. ఉద్యోగులకు స్థానచలనాలున్నాయి. అయితే ఆశించిన స్థానం లభించదు. వ్యవసాయదారులకు ఒడిదుడుకులు స్వల్పం.




తలపెట్టిన పనులలో విఘ్నాలు, చేసే వృత్తి, వ్యాపారాలలో ఆటంకాలు, ఆదాయనికి మించిన ఖర్చులు, శుభకార్యాచరణకు సంకేతాలు వస్తాయి. ప్రతి పనిలో ఆటంకాలెదురైన చిరాకు కలిగినా పట్టు విడవక ముందడుగు వేస్తారు. అనవసర ధన వ్యయం. స్పెక్యులేషన్ కలిసి రాదు. విద్యార్థులు స్వల్ప అశాంతితో తీసుకొన్న నిర్ణయాలు ఫలించవు. వ్యవసాయదారులకు దీర్ఘ ప్రణాళికలు లాభించవు.




మానసిక ప్రశాంతత లభిస్తుంది. హడావుడి నిర్ణయాలు వాయిదా పడతాయి. భార్యాభర్తల మధ్య కలతలు తగ్గుతాయి. ఇంట్లో చేసే శుభకార్య యత్నాలు బంధుమిత్రులతో పూర్తవుతాయి. స్త్రీలకు ఇది సామాన్య కాలం. విద్యార్థులు నూతన పరిచయాలేర్పరచుకోవద్దు. భాగస్వామ్య వ్యాపారాలలో లోపాలు సవరించుకొంటారు. కళా, క్రీడాకారులు భవిష్యత్తు పట్ల అనేకమైన ఆలోచనలు చేస్తారు.




మనోవాంఛ సంకల్పాలు నెరవేరుతాయి. ఇంటాబయట సంతోషాలు, సోమరితనం విడవడం వల్ల ముఖ్య సమస్యలు పరిష్కారమౌతాయి. ఉద్యోగులకు ఇది పరీక్షాకాలం. పై అధికారుల ఒత్తిడి, మన్ననలు పొందలేరు. చిక్కులు, చికాకులుగా వున్న కుటుంబ వ్యవహారాలకు పరిష్కారాన్వేషణ దొరుకుతుంది. రాజకీయులకు పై అధికారుల మన్ననలు అవసరమౌతాయి. వారాంతంలో మంచి మార్పులు.




అన్ని విధాల అనుకూలతలున్నప్పటికీ దుష్టులతో సహవాసం, తలపెట్టిన పనులలో ప్రతిబంధక వ్యవహారాలుంటాయి. కుటుంబంలో మాటలు పొసగకుండుట, వృథా ప్రయత్నాలు, ఆర్థిక నష్టం కాగలదు. అనవసర ఆవేశాలకు వెళ్లవద్దు. వృత్తి, వ్యాపార, ఉపాధి రంగాల వారికి అనుకూలం. ఉద్యోగులకు చేసే పనులలో లోపాలు తలెత్తుతాయి. తోటివారితో శత్రుత్వాలు వద్దు.




ఏలినాటి శనిప్రభావం స్వల్పంగా తగ్గుచుండుటచే చేసే పనులలో వ్యవహార విజయం, ఇష్టార్థ లాభం. అనితరసాధ్యమైన పనులలో స్వల్ప అనుకూలతలేర్పడగలవు. క్రమంగా మనోనిబ్బరం పెరిగి ఆత్మస్థైర్యం కలిగిస్తుంది. తొందరపాటు నిర్ణయాలు తీసుకోవద్దు. కళా, క్రీడాకారులకు సంతాన వృద్ధి. రాజకీయులు ఆంతరంగిక విషయాలను బహిర్గతం చేయవద్దు. అసత్య ఆరోపణలు తగ్గించండి.




ఉద్యోగులకు బదలీల సమస్య వుండదు. ఆర్థికమాంద్యం తగ్గుతుంది. వ్యాపార భాగస్వామ్య వ్యవహారాలలో మార్పులుండవు. అనివార్య కారణాలచే సంజాయిషీలు తప్పవు. ఇంట్లో శుభకార్యాచరణకు రంగం సిద్ధం. పితృ నిర్ణయాలపై ఆసక్తి పెంచుకుంటారు. విద్యార్థులకు సర్వత్రా విజయం. సంతానం గూర్చి ఆందోళన, వృత్తి, వ్యాపారాలలో లాభాలు. రాజకీయులకు మాట తొందర వల్ల కష్టనష్టాలుంటాయి.




పంతాలు, పట్టుదలలకు పోవద్దు. స్వయం వృత్తుల వారికి ఆశాజనకం, వాగ్దాన భంగాలుంటాయి. ముఖ్య ప్రయాణాలు లాభిస్తాయి. శత్రువులపై విమర్శలు చేయవద్దు. బంధుమిత్రుల ప్రేరణతో నిర్ణయాలు చేయకండి. విద్యార్థులకు చికాకులు తొలగి వ్యవహార విజయం కలుగుతుంది. వ్యవసాయదారులకు అధికారుల సలహాల వల్ల జయం. కళా, క్రీడాకారులు ప్రియమిత్రుల సలహాలు స్వీకరిస్తారు.




గతంలో ఏర్పడ్డ వివాదాంశాలు తొలగిపోతాయి. అయితే అనవసర ఖర్చులు, ముఖ్య విషయాలలో గోప్యత అవసరం. పంతాలకు పోతే మొదటికే మోసం. స్పెక్యులేషన్ వల్ల ఆర్థికనష్టం. కొన్ని విషయాలలో దైవసహాయంతో నెగ్గుకరాగలరు. వ్యవసాయదారులకు అనుకూలం కాదు. కళా, క్రీడాకారులకు ఇతర విషయాలలో జోక్యం పనికిరాదు. రాజకీయులు ఆలోచనా పరంపరలున్ననూ అస్థిమితం.




ఉద్యోగులకు విధి నిర్వహణలో బాధ్యతలు పెరుగుతాయి. వృత్తి, వ్యాపార లాభార్జనకై నూతన ఆలోచనలు చెయ్యాలి. విద్యార్థులు పై చదువులకై చేయు సంకల్పం నెరవేరుతుంది. వ్యవసాయదారులు నూతన ప్రణాళికలు వేస్తారు. రాజకీయులకు సర్వానుకూలత. ప్రయాణాలు, ప్రభుత్వ ప్రశంసలుంటాయి. ఇంట్లో వివాహాది ప్రయత్నాలకు అనుకూలం. కుటుంబ సౌఖ్యం, అవసరానికి ధన లబ్ధి.

## పంచాంగం

22తేది శ్రీరంగక్షేత్రంలో స్వామివారి జ్యేష్టాభిషేకం, ఆర్ద్ర కార్తె.
23తేది హల ప్రవాహము, వృషభపూజ, ఏరువాక పూర్ణిమ, వటసావిత్రి వ్రతం.
25తేది షబ్-ఏ-బరాత్.
26తేది సంకటహర చతుర్థి.

### శుభ ముహూర్తాలు

జూలై 8తేది వరకు గురుమూఢమి జరుగుతున్నందున శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య వ్యవహారాలకు శుభ ముహూర్తాలున్నాయి.

### జూన్ తిథులు

**జ్యేష్ఠ శుద్ధ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 22 | శని | చతుర్దశి | రా | 08.52 | గం.ల.వ |
| 23 | ఆది | పౌర్ణమి | ప | 05.02 | గం.ల.వ |

**జ్యేష్ఠ బహుళ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 24 | సోమ | పాడ్యమి | ప | 01.06 | గం.ల.వ |
| 25 | మంగళ | విదియ | ప | 09.22 | గం.ల.వ |
| 26 | బుధ | తదియ | ఉ | 05.55 | గం.ల.వ |
| | | తదుపరి చవితి | రా | 03.01 | గం.ల.వ |
| 27 | గురు | పంచమి | రా | 12.41 | గం.ల.వ |
| 28 | శుక్ర | షష్టి | రా | 11.08 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

# 'బ్రహ్మ'స్థాన గృహ నిర్మాణం శ్రేష్ఠం 'పిశాచి' స్థానం పరిత్యజించాలి!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

డాక్టర్ ఎ.సుబ్రమణియన్ చెన్నై

* *గృహ నిర్మాణం చేయదగిన స్థలము ఏది?*

స్థలం మొత్తాన్ని ఎనభై ఒక భాగాలుచేసి, ప్రతి దిశయందు 9 భాగాలుగా జేసి, అందులో కోణం వున్న రెండు భాగాల్ని చేస్తే మధ్య గల అయిదు భాగాలు ప్రధాన దిశలవుతాయి. హద్దు లోపల వున్న 1/9 భాగము పిశాచాంశము. లోపలి 1/9 భాగం మనుష్యావృతి, దాని లోపలి స్థానం బ్రహ్మస్థానం. మనుష్యావృతి, బ్రహ్మస్థానాలలో గృహ నిర్మాణం చేయవచ్చు. పిశాచాంశములో గృహ నిర్మాణము చేయకూడదు.

పి.వి.కె చెన్నై

* *నాది విశాఖ 3వ పాదం. అనారోగ్యం వదిలేటట్లు లేదు. ఏదైనా సలహా చెప్పండి?*

అన్ని మందులు వాడినా ఫలితం కన్పించలేదని చెబుతున్నారు కాబట్టి వాస్తు శాస్త్రరీత్యా విశాఖ తులరాశికి చెందినది. తులరాశికి అధిపతి శుక్రుడు. అతని శత్రువులు రవి, చంద్రులు గనుక 'తుల' రాశికి దేవతా వృక్షం 'ఒకుళ' దాని పత్రాలు, బెరడులను ఉపయోగించడం ద్వారా మీ వ్యాధి నయమవుతుంది.

తులసిరామయ్య సూళ్లూరుపేట

* *అవతలి వారు 'చేతబడి' చేస్తారేమో అని అనుమానంగా వుంది?*

'చేతబడి' ఒక నమ్మకం. బలహీనుల్ని వేధిస్తుంది. ధైర్యవంతుల నుంచి పారిపోతుంది. దాన్ని నమ్మకండి.

వై.సుప్రజ తిరుపతి

* *నూటొక్క 'నవగ్రహ' ప్రదక్షిణలు సమస్యల్ని తీరుస్తాయట కదా?*

నిజమే కావచ్చు. మీ ఆరోగ్యం సరిగాలేనప్పుడు అలాంటి ఛాందసాలకు పోకండి. సలహా యిచ్చిన మీ అత్తగారు అలా ప్రదక్షిణలు చేసినా సరిపోతుంది.

జె.ఎం.ఆర్ కందుకూరు

* *ఇంట్లో పెద్ద కుమార్తె వివాహం విఫలమయ్యింది. నవగ్రహ పూజ కూడా ఫలితాన్నివ్వలేదు?*

అమ్మాయిది కుంభరాశి. అధిష్టానం శని. కుంభరాశి వృక్ష దేవత శమీ వృక్షం. మండలం రోజులు 'శమీ'ప్రదక్షిణ చేసి చివరి రోజు నలుగురు పేద స్త్రీలకు భోజనం పెట్టండి. ఫలితం వుంటుంది.

టి.ఎం.కె చెన్నై

* *అతనితో వేగలేక విడిపోదామనుకుంటున్నాను.*

అలాంటి 'శాడిస్టును' యంత్రం మారుస్తుందో హతమారుస్తుందో చెప్పలేను. మీరు పెద్దవాళ్లతో చర్చించి ఖచ్చితమైన నిర్ణయాన్ని తీసుకోండి. స్త్రీ వేధకు, కన్నీటికి కారణమైనవారు చివరిదశలో నరకాన్ని అనుభవిస్తారన్నది శాస్త్ర వాక్యం.

డాక్టర్ శైలజ విజయవాడ

* *తులసి పూజ గృహం మారిన తర్వాత ఆగిపోయింది. ఒత్తిడులెక్కువగా వున్నాయి.*

గృహం మొదటి ఫ్లోర్‌లోనిదైనా సిట్టింగ్ కారిడార్స్‌లోనూ, లేదా పెరట్లోనూ తలుపుకు ప్రక్కగా పెట్టి పూజ చేయండి. తులసిపూజ మాంగల్యం ఆయువును పెంచుతుంది.

కె.సుస్మితారెడ్డి చెన్నై

* *తూర్పు స్థలంలో ఇంటిని కొనుగోలు చేశాము. ఎదురు ఖాళీ స్థలం వుంది. ఆయన ఆరోగ్యం మరింత దిగజారిపోయింది.*

తూర్పు ఇల్లు వాస్తు లోపాలు పురుషులపై ప్రభావం చూపిస్తుంది. వెంటనే లోపాలు సరిచేసుకోండి. నిర్ణీత యంత్ర ప్రతిష్ఠ చేస్తే ఆరోగ్యం బాగుపడుతుంది.

పి.నీరజారెడ్డి చెన్నై

* *ఇంట్లో చెట్టు తీసేయవలసి వచ్చింది. అరిష్టమా?*

అవసరంగా అలా చేయవలసి వచ్చిన వెంటనే పదకొండు మొక్కల్ని పెంచి పోషిస్తే ఆ దోష నివారణ అవుతుందని వశిష్ఠ వాస్తు ఉవాచ.

టి.కామాక్షమ్మ నాయుడుపేట

* *గృహాన్ని అమ్మేటప్పుడు వాస్తు దోషాలు సరిచేయలేదు. అందువల్లేనా ఈ సమస్యలు?*

గృహాన్ని అమ్మేటప్పుడు తప్పనిసరిగా వాస్తు దోషాలు సరిచేయాలి. అందులోనూ అమ్మకం, కొనుగోలు ఇళ్లు ఒకే దిక్కువైతే మరింత జాగ్రత్తగా వుండాలి.

● కృష్ణపట్నం పోర్ట్ పరిశీలనకు వచ్చిన...

# సాధికార కమిటీ పర్యటనలో అధికారుల తీరుపై విమర్శలు!

● సాధికార కమిటీ జిల్లా పర్యటనకు వస్తున్న విషయం పది రోజుల ముందుగానే కలక్టరేట్‌కు సమాచారం అందింది. ప్రతి అధికారిక పర్యటనను బహిర్గతం చేసే కలెక్టర్ సుప్రీంకోర్టు నియమించిన కమిటీ వివరాలు గోప్యంగా ఉంచడం విమర్శకు దారితీసింది.

కృష్ణపట్నం ఓడరేవును పరిశీలించేందుకు ఇటీవల జిల్లాకు విచ్చేసిన సుప్రీంకోర్టు నియమించిన సాధికార కమిటీ పర్యటనలో జిల్లా అధికారులు వ్యవహరించిన తీరుపై విమర్శలు, ఆరోపణలు వెల్లువెత్తాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించి ఎవరైనా అధికారిక పర్యటన నిమిత్తం జిల్లాకు రానున్న సమాచారాన్ని ముందుగానే కలెక్టరేట్ అధికారులకు అందిస్తారు. జిల్లా పౌరసంబంధాల శాఖ ఆధ్వర్యంలో అధికారులు, ప్రజాప్రతినిధుల పర్యటన వివరాలను మీడియాకు పంపుతారు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు కోసం నియమించిన శ్రీకృష్ణ కమిటీ రెండు రోజులపాటు జిల్లాలో పర్యటించింది. ఈ కమిటీ పర్యటన వివరాలను ముందుగానే అప్పటి జిల్లా కలెక్టర్ పత్రికలకు విడుదల చేయడం జరిగింది. కృష్ణపట్నం ఓడరేవు నిర్మాణం, పర్యావరణ అనుమతులు, ప్రభుత్వ భూముల ఆక్రమణపై వచ్చిన ఫిర్యాదులపై విచారణ జరపాలని సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జయకృష్ణన్ ఆధ్వర్యంలో కమిటీని నియమించింది.

ఈ కమిటీ జిల్లా పర్యటనకు వస్తున్న విషయం పది రోజుల ముందుగానే కలెక్టరేట్‌కు సమాచారం అందింది. ప్రతి అధికారిక పర్యటనను బహిర్గతం చేసే కలెక్టర్ సుప్రీంకోర్టు నియమించిన కమిటీ వివరాలు మాత్రం అత్యంత గోప్యంగా వుంచారు. కనీసం మీడియా ప్రతినిధులకు సైతం సమాచారం అందకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. చెన్నై నుంచి నెల్లూరుకు చేరుకున్న ఈ బృందం జాతీయ రహదారిపై రామదాసుకండ్రిగ మీదుగా కృష్ణపట్నం పోర్టుకు చేరుకుంది. పోర్టు నిర్మాణంపై సుప్రీంకోర్టుకు ఫిర్యాదుచేసిన ముత్తుకూరు మండలం చలివేంద్రం గ్రామానికి చెందిన బాధితుడిని ప్రత్యేక వాహనంలో పోర్టుకు తీసుకెళ్లారు. బాధితుడు సుప్రీంకోర్టుకు సమర్పించిన ఫిర్యాదులో పేర్కొన్న విషయాలను కమిటీ బృందానికి వివరించడంలో కొంతమేర వైఫల్యం చెందాడు. అటవీ శాఖ, కాలుష్య నియంత్రణ మండలి, రెవిన్యూ, నీటిపారుదల శాఖలకు చెందిన అధికారులు ముందుగానే నివేదికలు రూపొందించి సాధికారిక కమిటీకి సమర్పించాయి. ఎక్కడా నిబంధనలు ఉల్లంఘించలేదని కృష్ణపట్నం పోర్టు ప్రతినిధులు మరో నివేదికను అందించారు.

కృష్ణపట్నం పోర్టు ఏర్పాటుకోసం దాదాపు 2500 ఎకరాల భూమిని రెవిన్యూ శాఖ సేకరించి, పోర్టు యాజమాన్యానికి అప్పగించింది. ఇవి కాకుండా కండలేరు క్రీక్‌కు ఆనుకొని వున్న ప్రభుత్వ భూముల్ని ఆక్రమించడంతో మడ అడవుల్ని సైతం నరికి వేశారని సుప్రీంకోర్టుకు ఫిర్యాదు చేశారు. చెట్ల నరికివేత కారణంగా కాలుష్యం పెరిగి సమీప గ్రామాల్లో నివాసం వుంటున్న వారికి చర్మవ్యాధులు వ్యాపిస్తున్నాయన్న ప్రచారం వుంది. వీటన్నింటిపై తనిఖీలు, పరిశీలన జరిపేందుకు ఢిల్లీ నుంచి వచ్చిన ప్రత్యేక కమిటీని సామాన్య ప్రజలు కలుసుకొని సమస్యలను విన్నవించుకునేందుకు అవకాశం కల్పించక పోవడం బాధాకరం. కమిటీకి తమ బాధలు చెప్పుకోవాలని ఉదయం నుండి ఎంతో ఆశతో ఎదురుచూసిన ప్రజలు చివరకు అధికారుల తీరుతో నిరాశ చెందక తప్పలేదు.

### ప్రతిపక్షాల ఆగ్రహం

కృష్ణపట్నం పోర్టును పరిశీలించేందుకు వచ్చిన జస్టిస్ జయకృష్ణన్ కమిటీని ప్రజలు కలుసుకొనేందుకు జిల్లా కలెక్టర్ అనుమతి ఇవ్వక పోవడం పట్ల ప్రతిపక్ష పార్టీల నేతలు ఆగ్రహం వ్యక్తం చేశారు. అధికారిక పర్యటనను ఎందుకు గోప్యంగా వుంచాల్సి వచ్చిందని వారు ప్రశ్నించారు. పోర్టు నిర్మాణం వల్ల వాతావరణ కాలుష్యం పూర్తిగా దెబ్బతిని సమీప గ్రామాల ప్రజలు ఇబ్బంది పడుతున్నా అధికారులు ఎందుకు పట్టించుకోవడం లేదని మండి పడ్డారు. గోల్డెన్‌జూబ్లీ హాల్లో అధికారులతో సమీక్షా సమావేశం నిర్వహించిన కమిటీకి టిడిపి పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్రరాజగోపాల్, సిపిఐ, జనవిజ్ఞాన వేదిక తదితర ప్రజా సంఘాల నేతలు వినతి పత్రాలు సమర్పించారు.

### భారీ బందోబస్తు

సుప్రీంకోర్టు నియమించిన సాధికార కమిటీ జిల్లా పర్యటనను పురస్కరించుకొని భారీ స్థాయిలో పోలీసు బందోబస్తు ఏర్పాటు చేశారు. పినాకినీ అతిథి గృహం నుంచి కృష్ణపట్నం పోర్టు వరకు పోలీసుల్ని మోహరించారు. వాస్తవానికి భారీ బందోబస్తు అవసరం లేదు. సమీప గ్రామాల ప్రజలు కూడా ఆందోళన చేసేందుకు సిద్ధంగా లేరు. కేవలం వినతి పత్రాలు సమర్పించేందుకు పోర్టు వద్దకు రాగా గేటు బయటనే పోలీసులు నిలిపివేశారు. మీడియాను సైతం పోర్టు లోపలకు అనుమతించకపోగా బయట ఫోటోలు తీస్తున్న ఫోటోగ్రాఫర్లు, ఛానల్స్ సిబ్బంది పట్ల అతిగా ప్రవర్తించారు. పోర్టు యాజమాన్యం ఒక వర్గాన్ని ముందుగానే సిద్ధం చేసుకుని తమకు అనుకూలంగా కలక్టరేట్ వద్ద ధర్నా చేయించగా మరో వర్గం వ్యతిరేకంగా నినాదాలిస్తూ ధర్నాకు దిగడం ఇక్కడ విశేషం.

డోంట్ కేర్ ఎస్ఇ

# సిఎం ఆదేశాలు అమలు చేయని ట్రాన్స్‌కో ఎస్ఇ!

ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళికలో భాగంగా ఎస్సీ, ఎస్టీలకు 100 యూనిట్లలోపు విద్యుత్ వినియోగానికి బిల్లులు చెల్లించనవసరం లేదని ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఏప్రిల్ నెలలో నెల్లూరులో నిర్వహించిన ఇందిరమ్మ బాటలో ప్రకటించారు. కానీ జిల్లాలో ఎస్సీ, ఎస్టీ కాలనీల్లోని ప్రజలకు విద్యుత్ బిల్లులు ఇస్తూనే వున్నారు.

రాష్ట్రముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఆదేశాలు జిల్లాలో అమలు కావడం లేదు. ఇక ఇతర ప్రజాప్రతినిధులు, ఎమ్మెల్యేల మాట ఏమాత్రం అధికారులు లెక్కచేస్తారో అర్థం చేసుకోవచ్చు. ఇందిరమ్మబాట పర్యటనలో భాగంగా ఏప్రిల్ నెలలో రెండు దఫాలు జిల్లాలో పర్యటించారు. ఈ సందర్భంగా సూళ్లూరుపేటలో నిర్వహించిన బహిరంగ సభలో ఎస్సీ, ఎస్టీ ఉపప్రణాళికలో భాగంగా ఎస్సీ, ఎస్టీలకు 100 యూనిట్లలోపు విద్యుత్ వినియోగానికి బిల్లులు చెల్లించనవసరం లేదని సిఎం ప్రకటించారు. తొలుత 50 యూనిట్లుగా ప్రతిపాదించి ఆ తర్వాత 100 యూనిట్లకు వచ్చింది. మే నెలలో వినియోగించిన విద్యుత్‌కు జూన్ నెలలో బిల్లులు జారీచేసి చెల్లించాలని కోరుతున్నారు.

సిఎం పైప్రకటన చేసే సమయంలో రాష్ట్ర మంత్రులతోపాటు జిల్లా కలెక్టర్, విద్యుత్‌శాఖ అధికారులు, జిల్లా ఎమ్మెల్యేలు వేదిక ప్రక్కనే వున్నారు. అయితే మే నెలలో వాడిన విద్యుత్‌కు జూన్ నెలలో బిల్లులు జారీ చేసి బిల్లులు చెల్లించాలని ట్రాన్స్‌కో సిబ్బంది డిమాండ్ చేస్తున్నారు. ఎస్సీ, ఎస్టీ కాలనీలలో 100 యూనిట్లలోపు వాడిన విద్యుత్‌కు ప్రభుత్వం బిల్లులు చెల్లిస్తుందని ముఖ్యమంత్రి ప్రకటించడాన్ని ప్రస్తావించినప్పటికి సిబ్బంది ససేమిరా అంటున్నారు. నిర్ణీత గడువులోగా బిల్లులు చెల్లించకుంటే కనెక్షన్ తొలగిస్తామని ట్రాన్స్‌కో సిబ్బంది హెచ్చరిస్తున్నారు. ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళిక చట్టం ప్రకారం ఆయా వర్గాలకు కేటాయించే నిధుల్లో కొంత మొత్తాన్ని విద్యుత్ ఛార్జీలకు కేటాయిస్తామని సిఎం ప్రకటించిన తర్వాత కూడా ఆ దిశగా ట్రాన్స్‌కో అధికారులు చర్యలు తీసుకోవడం లేదు.

### ట్రాన్స్‌కో అధికారుల నిర్లక్ష్యం

ఎస్సీ, ఎస్టీ కాలనీలో విద్యుత్ బిల్లులు చెల్లించే విధానంపై ట్రాన్స్‌కో అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. ఎస్సీ, ఎస్టీల నుంచి 100 యూనిట్లలోపు బిల్లులు వసూలు చేయరాదని రాష్ట్ర ముఖ్యమంత్రి ఆదేశించినప్పటికి జిల్లా అధికారులు మాత్రం సిఎం ఆదేశాలు ఖాతరు చేయని పరిస్థితి. గతంలో ఏ విధంగా బిల్లులు జారీ చేసేవారో అదేవిధంగా ఇప్పుడు కూడా విద్యుత్ బిల్లులు ఇచ్చి వెళ్లిపోతున్నారు. విద్యుత్ బిల్లులు ప్రభుత్వం చెల్లిస్తుందని సిఎం ఇచ్చిన హామీపై జిల్లాలోని ఎస్సీ, ఎస్టీలు సంతోషించారు. కాని ప్రస్తుత పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. సిఎం ఆదేశాలతో మాకు సంబంధం లేదంటూ క్రిందిస్థాయి అధికారులు అంటున్నారు.

విద్యుత్ బిల్లుల చెల్లింపు, సిఎం ఆదేశాల గురించి ట్రాన్స్‌కో ఎస్ఇ నందకుమార్ స్పందించాలి. కాని ఎస్ఇ ఏ కారణం చేతనోగానీ దీనిపై ఎటువంటి ప్రకటన చేయలేదు. వివరణ కోసం ఎంత ప్రయత్నించినా ఫోన్ ఎత్తకపోవడం, ఎత్తినా సరైనా సమాధానం చెప్పకుండా దాటవేసేందుకు ప్రయత్నించడం విశేషం. సూళ్లూరుపేటలో జరిగిన బహిరంగ సభలో జిల్లా కలెక్టర్ కూడా సిఎం ప్రక్కనే వున్నారు. సిఎం, గవర్నర్‌ల నోటి నుంచి వచ్చిన ప్రతి మాట ఆదేశాల క్రిందనే పరిగణించాల్సి వుంటుంది. ఎస్సీ, ఎస్టీ కాలనీ ప్రజలు వినియోగించిన విద్యుత్‌కు ప్రభుత్వం బిల్లులు చెల్లిస్తుందని, ప్రజలు చెల్లించాల్సిన అవసరం లేదని, ఎవరైన డిమాండ్ చేస్తే జిల్లా కలెక్టర్‌కు ఫిర్యాదు చేయండని సిఎం అన్న మాటలు అధికారులు మరచిపోయినా, ప్రజలు గుర్తు చేస్తున్నారు.

ట్రాన్స్ ఎస్ఇ వ్యవహరిస్తున్న తీరు కారణంగానే బిల్లులు జారీ అవుతున్నాయి. రాజకీయ అండదండలు చూసుకొని తనను ఎవరు ఏం చేయలేరన్న ధీమాతో విధులు నిర్వహిస్తున్నాడు. సిఎం ఆదేశాల గురించి అధికారులకు సూచనలు చేయకపోవడంతో యధావిధిగా అన్ని యూనిట్లకు బిల్లులు జారీ అవుతున్నాయి. ఎస్ఇ నిర్వాకాన్ని ఎవరైన ప్రశ్నిస్తే జిల్లా కలెక్టర్‌కు సైతం ఫిర్యాదు చేసుకోమని దురుసుగా సమాధానం చెబుతున్నాడు. దీనిపై మంత్రులు, జిల్లా కలెక్టర్ ఏవిధంగా స్పందిస్తారో వేచి చూడాలి.

# నథింగ్...నథింగ్...!



✍ అల్లూరు రహీం




హిట్ చిత్రం కోసం హీరో సిద్దార్థ్ తహతహలాడుతున్నాడు. ఈ మధ్య ఆయన నటించిన అనగనగా ఓ ధీరుడు మొదలుకొని జబర్దస్త్ వరకు ఏ చిత్రం ప్రేక్షకాదరణకు నోచుకోలేదు. తాజాగా కామెడీ చిత్రాలు బాగా తీసే నటి కుష్బూ భర్త సి.సుందర్ నేతృత్వంలో సమ్‌థింగ్... సమ్‌థింగ్ చిత్రంతో ఓ ప్రయత్నం చేసినా అది విఫలమయ్యింది. ఈ సినిమాలో ఒక అమ్మాయి ప్రేమను పొందను హీరో అనుసరించే దగుల్బాజీ మార్గాలు, వీటిని ప్రబోధించను సృష్టించిన ప్రేమ్‌జీ పాత్ర జనరంజకంగా లేదు. ఈ సినిమా మొత్తం సిద్దార్ధ్, బ్రహ్మానందం, హన్సికల చుట్టే తిరుగుతుంది. ఈ తిరగమాతలో స్క్రీన్‌ప్లే రుచించలేదు. హీరోను ఎల్‌కెజిలోనే ప్రేమికునిగా చూపే యత్నం పండలేదు. పైపెచ్చు ఈయన ఇంటర్, డిగ్రీ ప్రేమలు విఫలం కావడానికి చూపిన కారణాలు సహేతుకంగా లేవు. అయితే ఈ సినిమాలో ప్రేమికులకు దర్శకుడు సి.సుందర్ కొన్ని ఐడియాలిచ్చాడు. కాఫీ షాప్‌లో మనం ప్రేమించే అమ్మాయితో వేరే అబ్బాయి మాట్లాడే సమయంలో మనమెలా వినాలన్న ఎత్తుగడ, అమ్మాయి ఫోన్ నెంబర్లు తెలుసుకోను వాడాల్సిన ట్రిక్కులు మాత్రం బాగున్నాయి. ఈ చిత్రంలో హీరో సిద్దార్థ్ కోసం ఆయన మిత్రులైన సమంత, రానా అతిథి పాత్రల్లో కనిపించినా ఆ పాత్రలు మెరుపులు మెరిపించ లేదు. గ్లామర్ హీరోయిన్ హన్సిక నర్తించిన ఓ మన్మధుడే పల్లవితో సాగే పాట మినహా మరోపాట జనరంజకంగా లేదు. సత్య సంగీతం గందరగోళంగా వుంది. వెలిగొండ శ్రీనివాస్ వ్రాసిన మాటలు మాత్రం పరవా లేదు. లవ్ సెట్ పాసవ్వడం కష్టం. మగాళ్లు ఎప్పుడూ డౌట్ పడకూడదు. లవ్‌కు వారంటీ... గ్యారంటీ లేవు. కోపపడే వారికి క్యారక్టర్ వుంటుంది. ఆడవాళ్లు రా లాంటి వాళ్లు. మిస్టర్‌ఫర్‌ఫెక్ట్ మగాళ్లు దేశంలో ఎక్కడా దొరకరు ఆలోచింపజేస్తాయి. చిత్రం చివరన మగధీర చిత్రాన్ని పోలిన నటీనటులందరితోపాటు కుష్బూ కూడా నర్తించేపాట పెట్టాడు దర్శకుడు. కుర్చీల నుంచి లేచే ప్రేక్షకులను ఈ పాట నిలపలేక పోయింది.

చిత్రకథలోనికి వెళ్తే ఓ సాఫ్ట్‌వేర్ కంపెనీ లోనికి కొత్తగా వచ్చి చేరుతుంది సంజన (హన్సిక). అద్భుత అందగత్తె అయిన ఆమెను తమ ముగ్గులో దించను ఈ కంపెనీలో పనిచేసే యువకులు మొదలుకొని మధ్య వయస్కులు వరకు అందరూ ప్రయత్నిస్తారు. చిన్నప్పటి నుంచి ప్రేమ విఫలాలను మూటగట్టుకొన్న కుమార్ (సిద్దార్థ్) కూడా లైన్‌లో నిలబడతాడు. కాని మరో ఉద్యోగి జార్జ్ గట్టిగా అడ్డు తగలడం లవ్ ఫిలాసఫీ గురు ప్రేమ్‌జీ (బ్రహ్మానందం)ను ఆశ్రయిస్తాడు కుమార్. అతనిచ్చే చెత్త సలహాల కోసం లక్షలకు లక్షలు ఖర్చుపెట్టి జార్జ్ సంజన ప్రేమబాట తప్పేలా చేస్తారు. సంజన ప్రేమను పొందే కుమార్‌కు ప్రేమ్‌జీనే అంతిమంగా అడ్డు తగులుతాడు. కారణం సంజన అతని మేనకోడలు కావడమే. సంజనకు కుమార్ అతని నిజస్వరూపం తెలిపేసరికి భగ్గుమంటోంది. రోమియోల కంబంధ హస్తాల నుంచి దూరంగా టోక్యోకు వెళ్లను ప్రయత్నిస్తుండగా విమానాశ్రయంలో కుమార్‌కు యాక్సిడెంట్ అవుతుంది. దీంతో మనసు మార్చుకొన్న సంజన కుమార్‌తో పెళ్లికి గ్రీన్ సిగ్నల్ ఇచ్చినా దేశంలో మిస్టర్ పర్‌ఫెక్ట్ మగాడు లేడన్న సందేశం ప్రేక్షకులకు ఇస్తుంది. పండని సన్నివేశాలు, లోపించిన నేటివిటి లాంటి సమ్‌థింగ్... సమ్‌థింగ్ విషయాలు విషయాలు ఈ సినిమాను నథింగ్ నథింగ్ బాట పట్టించాయి.

## మళ్లీ నాగచైతన్య, తమన్నా!



వెండితెరపై హిట్ కాంబినేషన్‌కు చాలా ప్రాధాన్యం ఉంటుంది. ప్రేక్షకులు ఆ జోడి నటించిన చిత్రాలు చూసేందుకు ఆసక్తి చూపిస్తుంటారు. నాగచైతన్య – తమన్నాల జంట కూడా హిట్ పెయిర్ జాబితాలోకి చేరింది. వీరిద్దరూ కలిసి నటించి 100% లవ్, తడాఖా బాక్సాఫీసు దగ్గర సందడి చేశాయి. ముచ్చటగా మూడోసారి వారిద్దరు కలసి నటిస్తున్నారు. నాగచైతన్య హీరోగా కామాక్షి మూవీస్ సంస్థ ఓ చిత్రాన్ని నిర్మించబోతోంది. ఢమరుకం ఫేమ్ శ్రీనివాసరెడ్డి దర్శకుడు. హాలోబ్రదర్ ఫార్ములా ఆధారంగా సాగే ఈ చిత్రంలో ఇద్దరు హీరోయిన్లు. ఓ హీరోయిన్‌గా తమన్నాను ఎంపిక చేశారు. ఇటీవల ఓ ఇంటర్వ్యూలో తమన్నా మాట్లాడుతూ తనకు నచ్చిన సహనటుడు నాగచైతన్య అని ఆయనకు కితాబిచ్చారామె.

## ఎందుకొచ్చానంటే....



హీరోయిన్ మాధురీదీక్షిత్ పేరువినగానే ఏక్ దో తీన్, ఛోళీకే పీచేక్యాహై పాటలు గుర్తుకొస్తాయి. వివాహానంతరం ఆమె సెకండ్ ఇన్నింగ్స్ ప్రారంభించి ప్రస్తుతం గులాబ్ గ్యాంగ్, దేఢ్ ఇష్కియా చిత్రాల్లో నటిస్తుంది. అమెరికా నుంచి ఎందుకొచ్చారని మాధురీని అడిగితే సమాధానంగా అక్కడ అంతా బాగానే ఉంది. కాని నేను ఇండియాకు తిరిగి రావాలనుకోవడానికి చాలా కారణాలే ఉన్నాయి. నటిగా నాకంటూ ఓ గుర్తింపు ఉంది. దాన్ని నిలబెట్టుకోవాలనుకున్నాను. నా పిల్లలకు ఇక్కడ నేను పెరిగిన వాతావరణాన్ని పరిచయం చేయాలి. అమెరికాలో వాళ్ల కోరింది ఇచ్చి పెంచొచ్చు. కానీ మేము ఎక్కడ నుంచి వచ్చాం. అసలు బయట ప్రపంచం అంటే ఎలా ఉంటుందో వారికి తెలియాలి. మరో కారణం కూడా ఉంది. నా తల్లిదండ్రులు కూడా పెద్దవాళ్లయిపోయారు. ఇలాంటి సమయంలో నేను వారి దగ్గరుండాలి. పైగా పిల్లలు పెద్దవాళ్లయితే మళ్లీ ఇక్కడకు రావడం కష్టమే. అందుకే అన్ని విధాల నేను తిరిగి ఇక్కడకు రావడానికి ఇదే సరైన సమయమని భావించాను. దీనికి తన భర్త డాక్టర్ శ్రీరాం మద్దతు పలికారంది.

## సమంతకు మంచి ఛాన్స్!



దక్షిణాది చిత్రసీమలో అదృష్టవంతురాలైన హీరోయిన్‌గా గుర్తింపు పొందింది సమంత. ప్రస్తుతం ఈమె చేతిలో అరడజను చిత్రాలున్నాయి. పవన్‌కళ్యాణ్, ఎన్టీఆర్, సూర్య... ఇలా అగ్రనటులతో వరుసగా చిత్రాలు చేస్తోంది. సమంత ముంగిటకు మరో భారీ చిత్రం వచ్చింది. ఏ.ఆర్. మురుగదాస్ దర్శకత్వంలో రూపొందే చిత్రమిది. విజయ్ హీరో. వీరిద్దరూ తుపాకీ తర్వాత కలసి చేయబోతున్న చిత్రమిది. ఈ సినిమాలో విజయ్ సరసన సమంత నటించబోతున్నట్లు చెన్నై సమాచారం. ఇప్పటికే ఆమెకు కథ, పాత్ర వివరాలు చెప్పారట. తొలుత ఈ పాత్రకు దీపికా పదుకొణే పేరు పరిశీలించారు. ఆమెను సంప్రదిస్తే కాల్షీట్లు సర్దుబాటు చేయలేనని స్పష్టం చేయడంతో ఆ అవకాశం సమంతకు దక్కింది.

## ప్రియా ఆనంద్ హ్యాపీ!

ప్రియా ఆనంద్ రూపంలో లీడర్ సినిమాతో తెలుగు తెరకు పరిచయమైన భామ ప్రియా ఆనంద్. ఆ తర్వాత ఈ ముద్దుగుమ్మకు రామరామ కృష్ణకృష్ణ, 180, కో అంటే కోటి సినిమాల్లో నటించే అవకాశం వచ్చినా హిట్‌లక్ దక్కలేదు. ఇదే సమయంలో తమిళం, హిందీ చిత్రాల వైపు దృష్టి పెట్టింది ప్రియా ఆనంద్. హిందీలో శ్రీదేవితో కలసి, ఇంగ్లిష్ వింగ్లిష్ సినిమాలో నటించింది. ఆ సినిమా ప్రియా ఆనంద్ జీవితాన్ని మలుపు తిప్పిందని చెప్పొచ్చు. తెలుగు, తమిళ భాషల్లో కూడా విడుదలైన 'ఇంగ్లిష్ వింగ్లిష్' బాక్సాఫీసు ముందు చక్కటి విజయాన్ని సొంతం చేసుకొంది. ఆ తర్వాత తమిళంలో ప్రియ చేసిన మరో చిత్రం 'ఎతిర్ నీచల్' కూడా ఘనవిజయం సాధించింది. ఇక అంతే. అప్పట్నుంచి ప్రియా ఆనంద్‌కు అవకాశాలు వెల్లువెత్తాయి. ప్రస్తుతం హిందీ, తమిళ భాషల్లో బిజీబిజీగా గుడుపుతోంది. హిందీలో ఫక్రీ అనే సినిమాలో నటిస్తోంది. తమిళంలో వణక్కం చెన్నై, వెయ్ రాజా వెయ్, అరిమనంబి చిత్రాల్లో నటిస్తోంది. తెలుగులోనూ పలువురు దర్శక నిర్మాతలు సంప్రదిస్తున్నారట. ఈ దశలో అమ్మడు కోటి రూపాయలు డిమాండ్ చేస్తుందనే వార్త ఇటీవల బయటకు వచ్చింది.



● డిగ్రీ ఫలితాల్లో

# కృష్ణచైతన్య హవా!



ర్యాంకులు సాధించిన విద్యార్థినులతో వైస్ ఛాన్సలర్ రాజారామిరెడ్డి.

ఇటీవల విడుదలైన డిగ్రీ పరీక్షా ఫలితాలలో నెల్లూరు వాహాబ్‌పేటలోని కృష్ణచైతన్య డిగ్రీ కాలేజి విద్యార్థులు మంచి ఫలితాలు సాధించారు. బిఎస్సీ మొదటి సంవత్సరంలో హసీనా 99 శాతం, బిసిఏలో మౌనిక 94 శాతం, బిబిఏలో విమల్‌జైన్ 93 శాతం మార్కులు సాధించారు. బిఎస్సీ రెండవ సంవత్సరం ఫలితాల్లో స్రవంతి, యువశ్రీలు 98.7 శాతం, బిసిఏలో ఉషారాణి, పవిత్రలు 96.3 శాతం, బిబిఏలో పుష్పలత 96 శాతం ఫలితాలు సాధించారు. మూడవ సంవత్సరం బిసిఏలో పూజాకుమారి 96 శాతం, పిజి సెట్‌లో శిరీష ఫిజిక్స్, స్టాటిటిక్స్‌లో మంచి మార్కులు సాధించారు. 75 శాతానికి పైగా 1199 మంది, 90 శాతానికి పైగా 388 మంది, మ్యాథ్స్‌లో నూటికి నూరు శాతం 558 మంది, స్టాటిస్టిక్స్‌లో నూటికి నూరు శాతం 149 మంది. కామర్స్‌లో నూటికి నూరు శాతం 20 మంది సాధించడం గర్వంగా వుందని కృష్ణచైతన్య కరస్పాండెంట్ చంద్రశేఖర్ రెడ్డి, డైరక్టర్ కృష్ణారెడ్డి తెలిపారు.

# స్కానింగ్ సెంటర్లపై కొరడా

జిల్లాలో వివిధ ఆసుపత్రులలో నిర్వహిస్తున్న స్కానింగ్ సెంటర్లపై జిల్లా వైద్య, ఆరోగ్య శాఖ అధికారి జి.సుధాకర్ కొరడా ఝుళిపించాడు. గర్భిణీలకు వైద్య ఆరోగ్య శాఖ నిబంధనలకు విరుద్ధంగా లింగ నిర్ధారణ పరీక్షలు చేయడంపై అనేక ఫిర్యాదులు రావడంతో తనిఖీలకు శ్రీకారం చుట్టారు. లింగ నిర్ధారణ పరీక్షల్లో ఆడ శిశువుగా తేలితే శిశువులను చంపేస్తున్నారు. దీంతో జనాభా సంఖ్యలో బాలికల సంఖ్య గణనీయంగా తగ్గిపోతుంది. స్కానింగ్ సెంటర్లు నిర్వహిస్తున్న వారు తప్పని సరిగా రేడియాలజిస్టుగా కోర్సు చేసి వుండాలి. ప్రతి సంవత్సరం వైద్య ఆరోగ్య శాఖ కార్యాలయంలో రెన్యువల్ చేసుకోవాలి. ఆ విధంగాలేని సెంటర్లపై డిఎంఅండ్ హెచ్ఓ తనిఖీ చేయడం సంచలనం సృష్టించింది.



# నల్లని వస్త్రాలతో నిరసన

## అనిల్ దీక్ష విరమణ ఎప్పుడు?

సృష్టిలో వున్న అన్ని రంగులు అందమైనవే. ఒక్కో రంగు ఒక్కో వాతావరణాన్ని ప్రతిబింబిస్తుంటుంది. ఈ రంగులన్నింటిలో నలుపు రంగుది ఒక ప్రత్యేక స్థానం. నలుపు రంగు డ్రస్సులను అటు ఫ్యాషన్‌కు, ఇటు నిరసన తెలిపేందుకు ఉపయోగిస్తుంటారు. ఈ కోవలోనే గత ఏడాది కాలంగా నిత్యం నల్ల దుస్తులను ధరించి నిరసనలో వినూత్నతకు తెరతీశాడు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సిటీ నియోజకవర్గ సమన్వయకర్త డాక్టర్ పోలుబోయిన అనిల్‌కుమార్ యాదవ్. వైఎస్ జగన్‌ను అరెస్ట్‌చేసి జైలులో వుంచడాన్ని నిరసిస్తూ ఆయన నల్లరంగు వస్త్రాలు ధరించి ప్రజల్లో తిరుగుతున్నాడు. జగన్ అరెస్టయి ఏడాది గడిచింది. ఈ ఏడాది కాలంగా నలుపు వస్త్రాలే ధరిస్తూ దీక్షలా నిరసన కార్యక్రమాన్ని చేపట్టడం పలువురిని ఆకట్టుకుంటుంది. ప్రజాదీవెన పేరుతో నిత్యం ప్రజల్లో తిరుగుతూ వైఎస్ జగన్‌ను అక్రమంగా అరెస్ట్ చేశారంటూ ప్రజలకు వివరిస్తూ పార్టీకి అండగా నిలవాలని కోరుతున్న అనిల్ చేస్తున్న ప్రచారానికి ప్రజల నుంచి మంచి స్పందనే లభిస్తోంది. వైఎస్ జగన్ జైలు నుంచి విడుదలయ్యేంతవరకు నల్లని దుస్తులే ధరిస్తానని, ఆయన విడుదల తర్వాతే మామూలు వస్త్రాలు వేసుకొంటానని చెప్తున్నాడు అనిల్. ఇంకెంత కాలం అనిల్ నల్లని దుస్తులు ధరించాలో కాలమే నిర్ణయించాలి.

# బాలకృష్ణ జన్మదినం

## దడబడలు సృష్టించిన కోటంరెడ్డి శీనయ్య



ఎన్టీఆర్ విగ్రహం వద్ద టిడిపి నేతల నివాళి.

తెలుగుదేశం పార్టీ పట్టణాధ్యక్షుడు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి సినీ హీరో, టిడిపినేత నందమూరి బాలకృష్ణ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని నగరంలో దడబడలు సృష్టించాడు. జూన్ 12న బాలయ్య జన్మదినం సందర్భంగా నగరంలో ఫ్లెక్సీలను ఏర్పాటుచేసి బాలకృష్ణపై తనకున్న అభిమానాన్ని చాటుకున్నాడు. అంతే కాకుండా జూన్ 14న ఈ కార్యక్రమంలో భాగంగానే జగన్ అవినీతి వ్యతిరేక కాంగ్రెస్ ప్రభుత్వ ప్రజావ్యతిరేక, విధానాలను నిరసిస్తూ నగరంలో భారీ ప్రదర్శన నిర్వహించడంతోపాటు నర్తకి సెంటర్‌లోని ఎన్టీఆర్ విగ్రహం వద్ద బహిరంగ సభ నిర్వహించారు. ఈ సభకు టిడిపి జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర, పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, సీనియర్ నేత గోరంట్ల బుచ్చయ్యచౌదరి, మాజీ మంత్రి, అఖిల భారత ఎన్టీఆర్ అభిమాన సంఘాల అధ్యక్షుడు తాళ్లపాక రమేష్‌రెడ్డి, తెలుగు మహిళ జిల్లా అధ్యక్షురాలు అంచల వాణి, అనూరాధ, వెంకటస్వామినాయుడు తదితరులు పాల్గొన్నారు. బాలకృష్ణ, ఎన్టీఆర్ అభిమానులు, తెలుగుదేశం పార్టీ కార్యకర్తలనుద్దేశించి సోమిరెడ్డి మాట్లాడుతూ వైఎస్ జగన్ చేసిన అవినీతి వలన పలువురు ఐఎఎస్‌లు, మంత్రులు జైలు పాలవుతున్నారని, మరోవైపు కెసిఆర్ ఉద్యమం పేరుతో అమాయకుల ప్రాణాలు బలిగొంటున్నాడని విమర్శించారు. బుచ్చయ్య చౌదరి మాట్లాడుతూ తెలుగుదేశం పార్టీ నీతివంతమైన పాలన అందిస్తే వైఎస్ రాజశేఖర్‌రెడ్డి హయాంలో రాష్ట్రాన్ని దోచుక తిన్నారన్నారు. టిడిపి జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర, కార్యక్రమ నిర్వాహకుడు బాలకృష్ణ సేవా సమితి కన్వీనర్ కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి మాట్లాడుతూ తెలుగుదేశం పార్టీని వచ్చే ఎన్నికల్లో గెలిపించడం బాలకృష్ణ జన్మదినానికి ఇచ్చే నిజమైన కానుకని చెప్పారు. ఈ కార్యక్రమానికి ముందు టిడిపి కార్యకర్తలు, బాలకృష్ణ అభిమానులు పేల్చిన టపాసుల శబ్దంతో నగరం మారుమ్రోగింది.

# కార్మిక నేతకు అభినందన!



ఆత్మకూరు అంకయ్యను అభినందిస్తున్న బిజెపి నేతలు.

భారతీయ జనతా మజ్దూర్ మహాసంఘ్ జిల్లా అధ్యక్షునిగా ఆత్మకూరు అంకయ్య రెండవసారి ఏకగ్రీవంగా ఎన్నికైన సందర్భంగా నర్తకి సెంటర్ ఆటోస్టాండ్, ముత్తుకూరు బస్టాండ్ ఆటో స్టాండ్ ఆధ్వర్యంలో సన్మాన కార్యక్రమం బిజెపి కార్యాలయంలో జరిగింది. బిజెపి రాష్ట్ర కార్యదర్శి కాకు విజయలక్ష్మి, జిల్లా అధ్యక్షుడు పి.సురేంద్రరెడ్డి, దళిత మోర్చా జిల్లా ప్రధాన కార్యదర్శి బండారు శ్రీనివాసులు, కాయల మధు, బిజెఎంఎం నగర అధ్యక్షుడు గంధం మాలకొండయ్య, బిజెఎంఎం నగర ప్రధాన కార్యదర్శి పోకూరు మాధవ్, ఆటోస్టాండ్ నాయకులు గుంజి జాన్, షేక్ ఖాదర్‌మస్తాన్, పుట్టయ్య, మణి, రమణారెడ్డి, సాయి శ్రీనివాస్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

● ప్రభుత్వ పాఠశాలల్లో

# చక్కని ఫలితాలు!

## రాజీవ్ విద్యామిషన్ పిడి వెల్లడి



పాఠ్యపుస్తకాలు పంపిణీ చేస్తున్న కోదండరామిరెడ్డి.

ప్రభుత్వ పాఠశాలల్లోని విద్యార్థులు ప్రైవేట్ పాఠశాలల విద్యార్థులకంటే ధీటుగా మెరుగైన ఫలితాలు సాధిస్తున్నారని రాజీవ్ విద్యామిషన్ ప్రాజెక్టు అధికారి కోదండరామిరెడ్డి తెలిపారు. విద్యాహక్కు వారోత్సవాలను పురస్కరించుకొని స్థానిక రంగనాయకులపేటలోగల ఉర్దూ పాఠశాలలోని విద్యార్థులకు యూనిఫాం, పాఠ్య పుస్తకాలను పంపిణీ చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ప్రభుత్వ పాఠశాలల్లో మౌలిక వసతుల కల్పనకు, పాఠశాలల అభివృద్ధికి ప్రభుత్వం అనేక చర్యలు చేపడుతున్నాదన్నారు. ముఖ్యంగా మైనార్టీల విద్యాభివృద్ధికి ఎంతగానో కృషి చేస్తున్నాదన్నారు. విద్యార్థినుల సౌకర్యం కోసం సైకిళ్లను అందజేస్తున్నామని, పాఠ్య పుస్తకాలు, యూనిఫాం పంపిణీ చేస్తున్నామని తెలిపారు. అలాగే మదర్సాలలో చదువుకొన్న విద్యార్థులకు కంప్యూటర్ విజ్ఞానాన్ని అందుబాటులో వుంచుతున్నామన్నారు. విద్యాహక్కు చట్టం ప్రకారం కనీసం ప్రతి ఒక్కరిని ఎనిమిదవ తరగతి వరకు చదివించాల్సిన బాధ్యత తల్లితండ్రులపై వుందన్నారు. ఈ కార్యక్రమంలో ఆర్‌విఎం సిఎంఓ శ్రీకంఠం రవిప్రసాద్, ఉర్దూ స్కూల్స్ ఇన్‌స్పెక్టర్ షా అహ్మద్, జయరామనాయుడు, ఈశ్వరయ్య తదితరులు పాల్గొన్నారు.

# నగర ట్రాఫిక్‌పై డిఎస్పీ దృష్టి!



నెల్లూరు నగరంలో రోజురోజుకు పెరిగిపోతున్న ట్రాఫిక్‌పై నగర డిఎస్పీ వెంకటనాథ్‌రెడ్డి దృష్టి సారించారు. అయ్యప్పగుడి సెంటర్ నుండి ఆత్మకూరు బస్టాండు వరకు వాహనాల రాకపోకలను ఆయన పలు దఫాలు పరిశీలించారు. రోడ్డు విస్తరించినప్పటికీ ఎక్కడ పడితే అక్కడ వాహనాలను నిలిపి వేయడంతో ట్రాఫిక్‌కు అంతరాయం కలుగుతుందని గుర్తించారు. ట్రాఫిక్ నియంత్రణలో భాగంగా ముందుగా ఆటోలకు బ్రేక్ వేయనున్నారు. బయట ప్రాంతాల నుంచి నగరంలోకి ప్రవేశించే ఆటోలు, వ్యాన్లను నగర శివారులోనే నిలిపివేయాలని నిర్ణయించారు. ఇందుకు అవసరమైన సిబ్బంది నియామకం గురించి ఎస్పీ దృష్టికి తీసుకెళ్లి చేపట్టాలని భావిస్తున్నారు. ఆటోలు, సిటీ బస్సుల దూకుడుకు కళ్లెం వేయాలని ట్రాఫిక్ ఎస్‌ఐలను ఆదేశించారు. ఇటీవల ఆటో యజమానులు, డ్రైవర్లు, సిటీ బస్సుల యజమానులతో నగర డిఎస్పీ ప్రత్యేక సమావేశాన్ని నిర్వహించి ట్రాఫిక్ నియంత్రణకు సహకరించాలని కోరారు. ట్రాఫిక్ నిబంధనలు ఉల్లంఘించిన వారికి జరిమానా విధించడంతోపాటు అవసరమైతే వాహనాన్ని సైతం సీజ్ చేస్తామని హెచ్చరికలు చేశారు. అయితే నగర జనాభాకు మించి ఆటోలు తిరుగుతున్న విషయం ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్లాల్సిన అవసరం రవాణా శాఖ, పోలీస్ శాఖలకు వుంది.

# 24వరకు ఓటరు నమోదు!

జిల్లాలో గత నెల రోజుల నుంచి నిర్విరామంగా నిర్వహిస్తున్న ఓటరు నమోదు, ఇంటింటి సర్వే కార్యక్రమం గడువును ఈ నెల 24 వరకు ఎన్నికల సంఘం పొడిగించింది. మే 15 నుంచి జూన్ 15వ తేదీ వరకు నెల రోజులపాటు ఇంటింటి సర్వే నిర్వహించి ఓటరు జాబితాలను రూపొందించాలని ఎన్నికల సంఘం నిర్ణయించింది. నిర్ణీత గడువులోగా కొన్ని ప్రాంతాల్లో సర్వే కార్యక్రమం పూర్తికాక పోవడంతో 24వ తేది వరకు గడువు పెంచింది. పోలింగ్ కేంద్రం స్థాయి అధికారులుగా నియమించే వారికి సరైన అవగాహన లేకపోవడం వలన ఓటరు నమోదు, ఇంటింటా సర్వే ఆశాజనకంగా జరగలేదు. రెవిన్యూ శాఖ ఆధ్వర్యంలో నిర్వహించే ఈ ప్రక్రియను పర్యవేక్షించే వారు కరువయ్యారు. బిఎల్‌ఓలకు ఏడాదికి 3వేల రూపాయలు రెమ్యునరేషన్ ఇస్తామని ఆశ కల్పించి నియామకం జరిపారు. మూడు సంవత్సరాల నుంచి రెమ్యునరేషన్ సక్రమంగా అందడం లేదని బిఎల్‌ఓలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. మండల తహశీల్దార్ కార్యాలయంలో నిర్వహించే సమావేశాలకు వెళ్లాల్సి రావడం, ఓటరు నమోదు దరఖాస్తులను అప్పగించేందుకు వెళ్లాల్సి వున్నందున ఆర్థిక ఇబ్బందులు ఏర్పడుతున్నాయని చెబుతున్నారు. వీఆర్వో, పంచాయితీ కార్యదర్శులు బిఎల్‌ఓలపైన పెత్తనం చెలాయిస్తుంటారు. దీంతో కొందరు బిఎల్‌ఓలు ఇంటింటా సర్వే చేసేందుకు ఆసక్తి చూపడం లేదన్నది వాస్తవం. ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ స్పందించి బిఎల్‌ఓలకు రావాల్సిన బకాయిలను విడుదల చేయించేందుకు కృషి చేయాలని వారు కోరుకొంటున్నారు.

# పాఠశాలలకు చేరని పుస్తకాలు!

## • ఈ ఏడాదీ వానాకాలం చదువులేనా?

విద్యా సంవత్సరం ప్రారంభం అయ్యే నాటికి ప్రాథమిక, ఉన్నత పాఠశాలలకు పాఠ్య పుస్తకాలు సరఫరా చేస్తామని గత సంవత్సరం ప్రకటించిన విద్యాశాఖ ఆచరణలో పూర్తిగా వైఫల్యం చెందింది. ఈ సంవత్సరం పాఠశాలలు ప్రారంభమైనప్పటికీ పాఠ్య పుస్తకాలు అందలేదు. రాష్ట్ర ప్రభుత్వం కొన్ని తరగతులకు సంబంధించిన పాఠ్య పుస్తకాలను మార్చినందున ముద్రణలో ఆలస్యం అవుతుందని విద్యాశాఖ అధికారులు అంటున్నారు. గత సంవత్సరంలోని అనుభవాలను దృష్టిలో వుంచుకొని ఈ దఫా విద్యా సంవత్సరం ప్రారంభం అయ్యే నాటికి అన్ని తరగతుల పాఠ్య పుస్తకాలు సరఫరా జరగాల్సి వుంది. అయితే రాష్ట్ర స్థాయిలోని అధికారులు పాఠ్య పుస్తకాల్ని త్వరతగతిన ముద్రించేందుకు కృషి చేయలేక పోవడంతో జాప్యం జరుగుతోంది. పాఠ్య పుస్తకాలు నిర్ణీత సమయానికి పాఠశాలలకు అందకుంటే ఉపాధ్యాయులు పాఠాలు బోధించలేని పరిస్థితి. విద్యార్థులు పుస్తకాలు సరఫరా అయ్యే వరకు ఎదురుచూడాల్సి వస్తుంది. రాష్ట్ర రాజధాని నుండి పుస్తకాలు సరఫరా కాకపోవడంతో జిల్లా విద్యాశాఖ అధికారులు ఏం సమాధానం చెప్పలేక పోతున్నారు. ఇప్పటికైనా ప్రభుత్వం స్పందించి పాఠశాలలకు పుస్తకాలు సరఫరా చేయాల్సిన అవసరం వుంది. లేకుంటే విద్యా సంవత్సరం గడిచేకొద్దీ విద్యార్థులు నష్టపోవాల్సి వస్తుంది.

## వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీలో ఆనందం

మొదటి పేజీ కొరవ

సానుభూతి వుంది. జగన్‌ను కాంగ్రెస్‌లోకి తీసుకరావడానికి చాలాసార్లు ప్రయత్నం చేశాడు. మొదట్లో జగన్ మొండిగా వుండిపోయాడు. తర్వాత జైలు జీవితంతో విసిగిపోయి, రాజీకి దిగ్విజయ్ వద్దకే వెళ్లాడు. సుబ్బారెడ్డి, విజయమ్మ ఆయన్ను పలుమార్లు కలిసి, కేంద్రంలో యూపిఏకు మద్దతిస్తామని బహిరంగంగా ప్రకటించాము కాబట్టి, జగన్‌ను కాపాడాలని కోరారు. అయితే సోనియా గాంధీ మీ పట్ల చాలా కోపంతో వున్నారు కాబట్టి కొంతకాలం ఆగండి, సమయం చూసి సర్దుబాటు చేస్తానని హామీ ఇచ్చాడు దిగ్విజయ్.

ఇప్పుడు ఆయన్ను రాష్ట్ర పరిశీలకుడిగా నియమించడం అంటే ఆ సమయం వచ్చినట్లే భావించవచ్చని ఆశ పడుతున్నారు జగన్ కుటుంబీకులు. దిగ్విజయ్ సింగ్‌కు రాష్ట్ర పరిస్థితులు క్షుణ్ణంగా తెలుసు. రేపటి ఎన్నికలలో కాంగ్రెస్ బ్రతికి బట్ట కట్టడం అసాధ్యమన్న నిజం గ్రహించినవాడు. జగన్‌తో కలిస్తే తప్ప కాంగ్రెస్‌కు భవిష్యత్తు లేదని సోనియాగాంధీకి నచ్చ చెప్పగలిగితే, పరిస్థితులు చాలా మారిపోతాయని, జగన్‌కు ఉపశమనం దొరుకుతుందని భావిస్తున్నారు. కేసులు తప్పించడం సోనియాగాంధీ వల్ల కూడా అయ్యే పని కాదు. అవి న్యాయ స్థానాలలోనే తేలాలి. కానీ జగన్‌కు జైలు జీవితం నుంచి విముక్తి కల్పించడం మాత్రం సోనియాగాంధీ చేతిలో పని. ఆమె గట్టిగా కోరుకొంటే, ఆదేశిస్తే జగన్ బెయిల్ దరఖాస్తులను సిబిఐ వ్యతిరేకించదు. సిబిఐ అడ్డం రాకుంటే క్రింది కోర్టులలోనే జగన్‌కు బెయిల్ లభిస్తుంది. దిగ్విజయ్ సింగ్ తమ పార్టీ అధినేత్రికి నచ్చ చెప్పి జగన్‌ను చెరసాల నుంచి బయటకు తెస్తాడని, త్వరలోనే అది జరగవచ్చునని ఆయన కుటుంబీకులు ఆశిస్తున్నారు.

అయితే జైలు నుంచి బయటకు తెచ్చినందుకు సోనియాగాంధీకి జగన్ ఏ రకంగా కృతజ్ఞత చెల్లిస్తాడన్నది ప్రశ్న. ఈ దశలో తన పార్టీని విలీనం చేయడం అనేది జరగని పని. రాయబారానికి కానీ, రాజీకి కానీ వున్న ఒకే ఒక్క మార్గం ఎన్నికల తర్వాత కాంగ్రెస్‌తో కలిసి పోతామనే హామీ ఇవ్వడం ఒక్కటే. ఆ పద్ధతిలోనే కదా చిరంజీవి ఇప్పుడు కేంద్రంలో మంత్రి అయ్యింది. అదే సూత్రం తనకూ వర్తింప చేయడం పెద్ద కష్టం కాకపోవచ్చునని, దిగ్విజయ్ చల్లగా చూస్తే తాను కటకటాల నుంచి బయట పడుతానని ఆశ పడుతున్నాడు జగన్. ఆయన అదృష్టం ఎట్లా వుందో వేచి చూద్దాం.




నెల్లూరు టౌన్‌హాల్‌లో గాయని జె.బాలార్కకు జరిగిన అభినందన సభలో కావలి సద్భావన సాధన సంస్థ తరపున సన్మానిస్తున్న జి.మారుతి, ఎ.సాయిశ్రీధర్, ఎన్.ఆర్.సుబ్బారావు.

## కొమ్మి వీరావేశం

9వ పేజీ కొరవ

తెలుసు. మేరిగ మురళీ మీద ఒంటికాలి మీద లేచాడు కొమ్మి. నా నియోజకవర్గంలో సభ పెట్టి నన్ను పిలవకుండా అవమానిస్తావా అని పెద్దగా కేకలు పెట్టాడట. మేరిగ మురళీ ఎంత బ్రతిమలాడినా కొమ్మి కోపం తగ్గలేదు. ఆయన వీరావేశం చూసి విజయమ్మ బిత్తరపోయారు. పక్కనున్న వారు ఎంత సర్దుబాటుకు ప్రయత్నం చేసినా కొమ్మి శాంతించలేదు.

ఈ పరిణామం జగన్ పార్టీని బాగా ఇబ్బంది పెట్టింది. పార్టీ అధ్యక్షురాలి సమక్షంలోనే జిల్లా నేతలు ఇంత విశృంఖలంగా ప్రవర్తించడాన్ని అనుమతిస్తే పార్టీలో క్రమశిక్షణ అదుపు తప్పిపోయే ప్రమాదం వుందన్నది వారి ఆందోళన.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

లపై వివిధ సినిమా హాళ్లలో నెల్లూరు ఎమ్మార్వో, ఆర్‌ఐలు తనిఖీలు జరిపారు. ఎక్కడికి వెళ్లినా కంపు కొడుతున్న టాయిలెట్లు, మంచినీరు లభ్యం కాక పోవడం, క్యాంటిన్లలో విపరీతంగా అమ్ముతున్న తినుబండారాల ధరలు కన్పించాయి ఈ తనిఖీ బృందానికి. మరోసారి ఇలా చేస్తే సహించమంటూ ఉత్తుత్తి హెచ్చరికలు చేసి తనిఖీ అయిందనిపించారు. ఇలాంటి తనిఖీలు జరిపినా, జరపకపోయినా ప్రేక్షకులకు ఎలాంటి మేలు జరగదు.

## కెసిఆర్ దిష్టిబొమ్మ దహనం

తెలంగాణ ఉద్యమం పేరుతో కెసిఆర్, కోదండరామ్‌లు రాష్ట్రంలో చిచ్చు పెడుతున్నారని ఆరోపిస్తూ విద్యార్థి జెఏసి నగరంలో ఆందోళన చేపట్టింది. ఏర్పాటు ఉద్యమం పేరుతో వీరు చేస్తున్న ఆగడాలను కఠినంగా అణచి వేయాలని డిమాండ్ చేస్తూ వీరి దిష్టిబొమ్మలను తగులబెట్టారు.

## శాస్త్రీయ సంగీత కచ్చేరి!

సర్వేపల్లి మ్యూజిక్ ఫౌండేషన్ నేతృత్వంలో 21వ తేది సాయంత్రం అంతర్జాతీయ సంగీత దినోత్సవాన్ని పురస్కరించుకొని టివిఎస్ కళ్యాణ మండపంలో పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ రచనలపై శాస్త్రీయ సంగీత కచ్చేరి ఏర్పాటు చేశారు. డివి సురేష్‌రావు గాత్రానికి పుదుక్కొట్టయ్ ఆర్.రామనాథన్ వయోలిన్, ఇలపావులూరి పినాకపాణి మృదంగం, శాంతి కళాధర్ కంజీరపై సహకరిస్తారు. సంగీత అభిమానులను ఈ కచ్చేరికి తరలి రమ్మంటున్నాడు ఫౌండేషన్ వ్యవస్థాపకుడు డాక్టర్ సర్వేపల్లి అజయ్‌కుమార్.

## చిన్నపిల్లల డాక్టర్ శ్రీధర్ మృతి!



నెల్లూరు పొగతోటలో చిన్నపిల్లల వైద్యంలో తిరుగులేని డాక్టర్‌గా పేరుగాంచిన డాక్టర్ శ్రీధర్ 16వ తేది చెన్నైలో కాలేయ సంబంధిత రుగ్మతతో బాధ పడుతూ మరణించారు. డాక్టర్ శ్రీధర్ కొన్నాళ్ల క్రితం వేధించిన క్యాన్సర్‌ను జయించాడు. కానీ దురదృష్టం వెన్నాడడంతో కాలేయ సంబంధిత రుగ్మతతో కన్నుమూయాల్సి వచ్చింది. డాక్టర్ శ్రీధర్ చిన్నపిల్లల వైద్యం చేసినంత కాలం నగరంలో ఆయనే నెంబర్ వన్ వైద్యునిగా కొనసాగారు. శ్రీధర్ సతీమణి చంద్రలత పేరుగాంచిన రచయిత్రి. ఆయనకు కుమారుడు, కుమార్తె ఉన్నారు. కుటుంబ పెద్దను కోల్పోయిన వారి కుటుంబానికి మా సానుభూతి.

## జనవాణి

2వ పేజీ కొరవ

ఒప్పించాలి. చెన్నై శివారు రైల్వే మార్గాలలో సరాసరి ఒకటిన్నర కిలో మీటరుకు ఒక రైల్వేస్టేషన్ ఉంది.

ఎన్.రామచంద్రారెడ్డి చెన్నై

### అభినందనీయం

ఓటులేని పౌరుడు ప్రజాస్వామ్యానికి ఎంత చేటో రాజకీయ నాయకుడు దేశానికి అంతే చేటు. దేశంలోని ప్రధాన రాజకీయ పక్షాలను సమాచార హక్కు పరిధిలోనికి సిఐసి తీసుకురావాలని నిర్ణయించడం అభినందనీయం. రాజకీయాల్లో ధన ప్రవాహాన్ని ఈ చర్య అడ్డుకోగలదు. కాని రాజకీయాల్లో బిజెపి మినహా మరోపార్టీ ఈ వ్యవహారాన్ని సమర్థించడం లేదు. సిపిఎం కూడా సమాచార హక్కు చట్టాన్ని తప్పుపట్టడం బాధాకరం. శాసనసభ్యుడిని తొలగించే అధికారం చట్టసభలకు ఉన్నప్పుడు సమాచార హక్కుపరిధిలోనికి రాజకీయ పార్టీలు ఎందుకు రావు. ఈ వ్యవహారమై ఒక ప్రజా ఉద్యమం మొదలవ్వాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

వాస్తు రామచంద్ర నెల్లూరు

## పదరంగం -72

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | ■ | 4 | 5 | 6 | ■ | 7 |
| | ■ | 8 | | 9 | ■ | 10 | | ■ | |
| 11 | 12 | | ■ | 13 | | | ■ | 14 | |
| 15 | | ■ | 16 | | ■ | ■ | 17 | | ■ |
| ■ | ■ | 18 | | ■ | 19 | ■ | 20 | | |
| 21 | 22 | | | ■ | 23 | 24 | | | ■ |
| 25 | | | ■ | 26 | | | | ■ | 27 |
| | ■ | 28 | | | | ■ | ■ | 29 | |
| ■ | 30 | | ■ | | ■ | ■ | 31 | | |
| 32 | | | ■ | 33 | | | | | |

**అడ్డం**

1. ఆలాపించడం (4)
4. కాగడా అటునుంచి (3)
8. అటునుంచి ఆకు రసం (3)
10. హిందీ పెండ్లి (2)
11. పాటకు ప్రక్క వాద్యం (ఒక సినిమా పేరు) (3)
13. తెలుగు ఎంటర్‌టైన్‌మెంట్ (3)
14. తెలుగు బ్యూటీ (2)
15. కొండ, పర్వతం అటునుంచి (2)
16. బొమ్మ, ఆశ్చర్యం – రామోజీగారి సినిమా (2)
17. వధించడం (2)
18. ఎంకికి నాయుడు బావ ఏమవుతాడు? (2)
20. రాక్షసి, (తేలికగా) (3)
21. టి.వి. (4)
23. మనస్సును హరించేది (4)
25. తడబడిన తరులు (3)
26. ఆకృతి (4)
28. హెచ్చవేత (4)
29. అటునుంచి దురద (2)
30. అటునుంచి సమతల ప్రదేశం (2)
31. ప్రేమ (3)
32. చందమామ (3)
33. కనిపించీ కనిపించని నవ్వు (6)

**నిలువు**

1. బాధతో కూడిన కేక (4)
2. ప్రతిష్టకు ముందు మాట (3)
3. జీడిమామిడి రుచి (2)
5. తెలుగు సారో (3)
6. హిందీ అక్కయ్య (2)
7. ఒడంబడిక, సమ్మతి (3)
9. పావనం (3)
12. క్రింద నుంచి కోరుకోవడం (2)
14. చీకటి (4)
16. అంచు, ఎండే (3)
17. పంది (4)
18. శంకరంబాడి గారి గేయం (6)
19. ప్రేమ, వాత్సల్యం (4)
21. కోట శిఖరం (3)
22. క్రిందనుంచి అమ్మ (2)
24. నోరార 1, 3 అక్షరాలు (2)
26. నింగి, అంబరం (4)
27. సంపెంగ, మల్లెల వంటి సువాసన పువ్వు (4)
29. రెండు 'ల'లతో స్త్రీ (3)
30. క్రింద నుంచి కొండ గుహ, తొర్ర (2)
31. వనవాసి 1,4 అక్షరాలు (2)

**సమాధానాలు**

## పదరంగం -71

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప్ర | రా | 2 శ | ■ | 3 ఆ | లో | చ | 4 న | ■ | 5 సా |
| ద | ■ | 6 త | ర | ము | ■ | ■ | 7 గ | 8 త | ము |
| 9 రా | 10 వ | ము | ■ | 11 ద | 12 శ | 13 ము | ■ | 14 ది | గ |
| 15 లు | కీ | ■ | 16 కా | ము | కు | డు | ■ | 17 య | రి |
| ■ | 18 లు | 19 తే | ■ | ■ | 20 ని | త | 21 వి | ■ | డీ |
| 22 వి | ■ | 23 గ | 24 త | 25 ము | ■ | ■ | 26 క | 27 ల | లు |
| 28 శా | ఖ | ■ | 29 గ | రి | క | ■ | ■ | వ | ■ |
| లం | ■ | 30 రం | వు | పా | ■ | 31 మ | 32 లి | న | 33 ము |
| ■ | 34 కం | పు | ■ | 35 లు | 36 కా | స్త | పు | ■ | ర |
| 37 ము | ర | కా | సా | ■ | 38 కి | కం | ■ | 39 రే | పు |

# శ్రీకృష్ణదేవరాయల 'ఔన్నత్యాన్ని విడిచి' కులాన్ని గురించి రచ్చ చేస్తున్నారు!

విద్యారణ్య మహర్షి ఆశీస్సులతో మార్గదర్శకత్వం, సహాయ సహకారాలతో సంగమ, బుక్క రాయలు విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించి వుండకపోతే సుమారు నాలుగు వందల యాభై సంవత్సరాలపాటు తురుష్క సమూహాన్ని నిలువరించే బలవంతులు ఎవ్వరూ వుండేవారు కాదు. కాకతీయ సామ్రాజ్యం నామరూపాలు లేకుండా నశించిపోయినట్లే. హిందూ సామ్రాజ్యం కూడా వారి ఆక్రమణలకు గురై 'తుర్కిస్థాన్'గా రూపాంతరం చెంది వుండేది. ఆంధ్రుల సంస్కృతి, చరిత్ర సంగమ, సాళువ, తుళువ, ఆరవీటి రాజ వంశాలతో కూడిన విజయనగర సామ్రాజ్య చరిత్రలో తుళువ వంశాంభుదిసోముడైన శ్రీకృష్ణదేవరాయల పాత్ర ఈ విషయంలో తక్కువైనదేమీ కాదు. అతను వ్యక్తిగతంగా ఎంత సహృదయుడో, మరెంతటి సౌమ్యుడో, యుద్ధతంత్రపరంగా మహా ధైర్యశాలి, సాహసి. అరివీర భయంకరుడు. ఉరకలు వేసే ఉత్సాహంతో తాను ముందుండి సైన్యాన్ని చైతన్య పరుస్తూ 'జై విరూపాక్షా' అని ఉగ్రంగా గొంతుకును మ్రోగిస్తూ కదన రంగంలోకి దూకేవాడు. అతని వ్యూహం, ధైర్యం, సాహసం, వీరత్వమే అతనికి దిగ్విజయాల్ని కలిగించాయి అంటారు విదేశీ, స్వదేశీ చరిత్రకారులు.

ప్రజా సంరక్షకుడై, పరిపాలనాదక్షుడై, యుద్ధతంత్ర నిపుణుడై, సాహితీ సమరాంగణ సార్వభౌముడై, ప్రజా విశ్వాసాన్ని, అభిమానాన్ని చూరగొని ప్రజలు, యాత్రికులు, రాయబారులు, చరిత్రకారుల ప్రశంసలు అందుకున్న శ్రీకృష్ణదేవరాయలు ఒక ఆదర్శవ్యక్తి. విజయనగర సామ్రాజ్య కాలంలో అతని యుగం 'ఒక స్వర్ణ యుగం' ఒక రామరాజ్యం. అటువంటి మహా వ్యక్తి ఏ కులానికి చెందిన వాడో చరిత్రకు సరైన ఆధారాలు లేవు. నిర్దుష్టమైన, నిర్ణీతమైన, ఖచ్చితమైన ఆధారాలు ఇంతవరకూ ఎవ్వరూ చూపించలేదు. రాయల కులం అంత ముఖ్యమూ కాదు. అయినప్పటికీ ఆ మధ్య రాయల కులంపై పెద్ద దుమారమే రేగింది.

ఒక దిన పత్రికలో సీరియస్‌గాను, సీరియల్‌గానూ వాదోపవాదాలు జరిగాయి. ఈ మధ్య అదే వాదనలు నడుస్తున్న చరిత్ర మాస పత్రికలోనూ జరిగాయి. చాలాకాలం క్రితం చిత్తూరు జిల్లా నాగలాపురం నుంచి ఒక వార్త ప్రబలంగా వినిపించింది. రాయల తల్లి నాగమాంబ చిత్తూరు జిల్లా హరికందాపురం (ఈ గ్రామాన్ని రాయలు నాగలాపురంగా మార్చి అక్కడ వేదనారాయణస్వామి ఆలయాన్ని నిర్మించాడు) అదేమిటంటే నాగమాంబ బలిజ కుల స్థురాలు, కూర్మి వంశానికి చెందినది. (కూర్మి వంశీయులు బలిజ కులస్థులని ఒక వాదన) అందువల్ల రాయలు బలిజ కులస్థుడు. ఈ వాదనకు విపరీత ప్రచారం లభించింది. ఈ వాదన విస్తృత ప్రచారంలో వున్నప్పుడు కమ్మ, యాదవ, క్షత్రియ కులాలవారు 'కామోసు' ననుకుని 'నిమ్మకు నీరెత్తినట్లు' ఉండి పోయారు. ఇది అవకాశంగా బలిజ, కాపు, తెలగ కులస్థులు (ఒకే కులం) తమ పేర్ల చివర రాయలు పదాన్ని చేర్చుకొని చెలామణి అయ్యారు. ఈ చెలామణి బలిజల ప్రాబల్యం వున్న ప్రాంతాల నుంచి జరిగింది.

ఆ తర్వాతే కులాల కుమ్ములాట ప్రారంభమై ఆంధ్రజ్యోతిలోనూ, నడుస్తున్న చరిత్రలోనూ విస్తృతంగా వ్యాసాలు వచ్చాయి. ఒకరు రాయల్ని యాదవుడంటే, మరొకరు క్షత్రియుడన్నారు. కొందరు కమ్మ వర్గం వాడంటే మరికొందరు బలిజ కులస్థుడన్నారు. మొత్తానికి తమకు తోచిన ఆధారాలతో అతనిట్లన్నాడు, ఇతనిట్లన్నాడని రాయల కులానికి జుట్టుకీ, మోకాలుకీ ముడి పెట్టడానికి చాలా ప్రయత్నాలు చేశారు.

నేను ఒక చరిత్రకారుడుగా ఈ వ్యాఖ్యలన్నింటినీ నిర్ద్వంద్వంగా ఖండిస్తూ వ్యాసాలు రాశాను. వాటి సారాంశం ఏమిటంటే...

రాయలు కమ్మ, క్షత్రియ, యాదవ, బలిజ వంశస్థుడని చెప్పడానికి చారిత్రకమైన ఆధారాలు లేవు. అన్నీ ఊహాత్మకమైనవే. ఇవన్నీ స్థిరమైనవి కావు. సంగమ వంశస్థులకు ఒక కులానికి సంబంధించిన ఆధారాలున్నాయి. వారి పాలన, మాట తీరులో కన్నడం ప్రస్ఫుటించింది. ఆ తర్వాతి సాళువ, తుళువ, ఆరవీటి రాజ వంశాల పాలన, అంతఃపురం, ప్రజానీకం ముఖాముఖి అంతా తెలుగులోనే కొనసాగింది. అంతఃపురాలలో స్వచ్ఛమైన తెలుగు మాట్లాడేవారని 'రాబర్ట్ సీవెల్' లాంటి వారు చెప్పారు. కృష్ణరాయల తండ్రి నరసనాయకుడు, తల్లి నాగమాంబ కులాలు నిర్ణయించడానికి అటు శాసన, ప్రాచీన పత్ర ఆధారాలు లేవు. పైగా రాజు ఏ కులానికి చెందినవాడైనా, రాణులు వేర్వేరు కులాలకు చెందిన వారై వుండేవారు.

నాగమాంబ కులం విషయంలో వివిధ వాదనలున్నాయి. వివాహం తర్వాత నాగమాంబ బంధువులకు రాజ్యంలో తగిన ప్రాధాన్యత యిచ్చినట్లు కనిపించదు. వివిధ పత్రికలలో వచ్చిన వ్యాసాల వల్ల రాయల్ని పై కులాలలో ఒక దానికి, లేదా అన్ని కులాలకు సంబంధాలు చూపగల ముఖ్యమైన ఆధారాలేవీ ఆ వ్యాసాలలో లేవు. అందువల్ల అతని తల్లి ఏ కులానికి చెందినదో నిరూపించగల ఆధారాల్ని సంపాదించడమో లేదా అతనొక మహోన్నతమైన చారిత్రక వ్యక్తిగా పరిగణించి అతను కులాలకు అతీతుడని ప్రకటించడమో చేయాలి. ఇది నా వ్యాస సారాంశం. ఈ వ్యాసం ప్రచురించబడ్డాక నాకు ఫోన్ల ద్వారా అనేకులు అనేక వాదనలు వినిపించారు. రాయలు తమ కులము వాడంటే తమ కులము వాడని చెప్పడానికి విశ్వ ప్రయత్నం చేశారు. నన్ను బలవంతంగా ఒప్పించడానికి ప్రయత్నాలు చేశారు. ఒక చరిత్ర కారుడుగా ఆధారాలు లేకుండా నేనెవ్వరికీ తలవంచే ప్రసక్తి లేదు. నేను చివరగా చెప్పేదేమంటే నా కృషి జరుగుతూనే వుంది. రాయలు సామాజిక వర్గమేదో ప్రజల ముందుకు తేవడానికి ప్రయత్నిస్తున్నాను.

ఎవరైనా సరే నిక్కచ్చితమైన ఆధారాలతో ముందుకు వచ్చినా సరే. ఆధార రహితంగా నిరూపించినా సరే నేను కూడా నా నిర్ణయాన్ని ప్రకటిస్తాను.

**– పాయసం సుబ్రహ్మణ్య మహర్షి**



రైతు లోకం

# పచ్చిరొట్ట పైర్ల సాగుతో ప్రయోజనాలు!

నేలకు అధిక మొత్తంలో సేంద్రీయ పదార్థాన్ని అందించడం ద్వారా భూభౌతిక రసాయనిక స్థితి మెరుగుపడుతుంది. భూమి గుల్లబారి నీటిని నిలుపుకొనే శక్తి పెరగడంతోపాటు పంటల వేర్లు బాగా సులువుగా పెరగటానికి దోహదపడుతుంది. నేలలో సూక్ష్మ జీవులు వృద్ధి చెంది, నేల జీవశక్తి పెరిగి వేసిన రసాయనిక ఎరువులు సమర్ధ వినియోగానికి తోడ్పడుతుంది.

పంటలకు కావలసిన నత్రజని, భాస్వరం, పొటాష్ వంటి ప్రధాన పోషకాలతోపాటు పలు ద్వితీయ మరియు సూక్ష్మ పోషకాలు అందుతాయి. కాబట్టి పచ్చిరొట్ట పైర్లు సాగు చేసినప్పుడు పంటలకు వేయవలసిన ఎరువుల మోతాదును 1/2వ వంతు వరకు తగ్గించవచ్చు. తద్వారా రసాయనిక ఎరువులపై ఖర్చు తగ్గుతుంది. పచ్చిరొట్ట పైర్లు లోతైన వేరు వ్యవస్థ కలిగి వుండటం వల్ల నేల లోపలి పొరలలోని నీటిని, పోషకాలను గ్రహించి వీటిని కలియ

**డాక్టర్ కె.పుల్లంరాజు**
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

దున్నటం వల్ల పోషకాలు నేల పై పొరల్లో నిక్షిప్తమై మొత్తం పోషక వినియోగ సామర్థ్యం పెరుగుతుంది.

లెగ్యూమ్ జాతి పచ్చిరొట్ట పైర్ల సాగుతో వేరు బుడిపెలలో నత్రజని స్థిరీకరింపబడి నేలలో నత్రజని స్థాయి పెరుగుతుంది.

పచ్చిరొట్ట పైర్లు భూమిలోని చౌడు, క్షార గుణాన్ని తగ్గిస్తాయి. పచ్చి రొట్ట పైర్ల సాగు వల్ల కలుపు అణచి వేయబడుతుంది. జనుము, పిల్లి పెసర, అలసంద వంటి పైర్లు పశువుల మేతగా కూడా ఉపయోగపడతాయి.

ఖాళీగా వున్న నేలల్లో పచ్చిరొట్ట పైర్ల సాగు వల్ల నేల కోత తగ్గి సారవంతమైన నేల పై పొర పరిరక్షింపబడుతుంది. పచ్చిరొట్ట పైర్ల సాగుతో వాతావరణ కాలుష్యం తగ్గి, సాగు ఖర్చులు తగ్గి పంటల దిగుబడి, నాణ్యత పెరుగుతుంది.



Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/12-14
జమీన్‌రైతు







## నెల్లూరులో మొట్టమొదటి సారిగా...
## అంతర్జాతీయ ప్రమాణాలతో అభివృద్ధి చేయబడిన
# రెసిడెన్షియల్ గేటెడ్ కమ్యూనిటి టౌన్‌షిప్

# Adithya Elixir

(Residential Gated Community Township)

**For Luxurious Living**

**@ KRISHNAPATNAM NEW PORT ROAD, JUST 1 KM FAR FROM N.H.5,**
**JUST 15 MINUTES DRIVE FROM R.T.C. BUS STAND, NELLORE.**




































**Contact :**

**+91 965 241 5441**
**+91 888 554 1233**
**+91 990 841 7936**

**Web-site:www.escondevelopers.com**













## Amenities :-

- 24x7 Security
- Underground Electricity
- Underground Sewage System with treatment plant
- Underground Rain Water Drainage
- 24 Hours Water Supply
- Compound Wall With Arch
- Spacious Tar Roads
- Children Play Area With Play Equipments
- 30,000 sft Club House
- Health Clubs separate for Ladies & Gents
- Swimming pools separate for Ladies & Gents
- Gym separate for Ladies & Gents
- Sai baba Temple & Anjaneya Statue
- Spacious Parks
- Tennis Court
- Indoor Shuttle

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com